## బోగస్ కార్డులు - కొత్త పన్నులు

రాష్ట్రంలో సబ్సిడీ బియ్యం పథకం అమలుకు పెద్ద అవరోధంగా పరిణమిస్తున్న సమస్య బోగస్ కార్డుల సంఖ్య. పథకానికి అర్హమైన పరిమిత ఆదాయ పరిధిలోకి 4 కోట్ల 56 లక్షల మంది వస్తున్నారని 1991 జనాభా లెక్కలు సూచిస్తున్నాయి. అంటే మొత్తం జనాభాలో దాదాపు 70 శాతం మంది తాము దారిద్ర్య రేఖకు దిగువన వున్నామని ప్రభుత్వ లెక్కల్లో నమోదు చేసుకున్నారన్న మాట. దాదాపు కోటి తెల్ల కార్డులు వీరి చేతుల్లో వున్నాయి. ఇన్ని కార్డుల లెక్కతో, ఇంతమందికి సబ్సిడీ బియ్యం అందించ వలసి రావడం వల్లే ఆ పథకం ఖర్చు తడిసి మోపెడయి మోయలేని భారంగా వుంది.

సబ్సిడీ బియ్యం పథకం నిరుపేదలకు వుద్దేశించింది. దారిద్ర్య రేఖకు దిగువన, పూట గడవటానికి ఇబ్బంది పడే నిరుపేదలు కడుపు నిండా పట్టెడన్నం తింటారనే ఉదాత్తాశయంతోనే ఈ పథకాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది. కాని, తమ ఆదాయ వనరులను కావాలని తగ్గించి ప్రకటించుకొని, నిక్షేపంగా వున్నవారు సైతం ఈ పథకం ద్వారా లబ్ధిని పొందడం క్షమార్హమైన విషయం కాదు. అంతకంటే హీనమైన పరిస్థితి - బోగస్ కార్డులది. అసలు మనుషులే లేకుండా డీలర్లు దొంగ పేర్లు వ్రాసి తమ వద్ద వుంచుకొన్న బోగస్ కార్డుల సంఖ్య అధమ పక్షం 20 లక్షలని ఒక అంచనా. బ్లాక్ మార్కెట్‌లో బియ్యం అమ్ముకొని లాభ పడడానికి డీలర్లు తమ వద్ద వుంచుకొన్న ఈ బోగస్ కార్డుల వల్ల ఇప్పటి లెక్క ప్రకారం ప్రభుత్వ ఖజానాపై ఏటా 300 కోట్ల రూపాయల భారం పడుతుందని అధికారులే వివరణ ఇస్తున్నారు. ఒక్కొక్క లక్ష కార్డులపై సబ్సిడీ వ్యయం ఏడాదికి 15 కోట్ల వరకు వుంటుందన్న అంచనాతో ఈ లెక్క తేల్చడం జరుగుతున్నది.

కేవలం అర్హులైన కుటుంబాలనే పథకం క్రింద వర్తింపజేసి, బోగస్ కార్డులను రద్దు చేస్తే సబ్సిడీ వ్యయం సగానికి సగం తగ్గిపోతుంది. ప్రభుత్వంలోని పార్టీ రాజకీయ ప్రయోజనం కోసం వుద్దేశించిన ఒక పథకం అమలులో అక్రమ పద్ధతుల వల్ల ఇన్ని వందల కోట్ల రూపాయల ప్రజాధనం అపాత్రదానం కావడం సహించరాని విషయం. కూలి పని చేసుకొంటే తప్ప పూట గడవని నిరుపేదల ఆకలి తీర్చడానికి వుద్దేశించిన పథకం వ్యాపారుల లాభాల కక్కుర్తికి, నిక్షేపంగా బజారులో బియ్యం కొని తినగల్గిన కుటుంబాల భుక్తికి దుర్వినియోగం కావడం క్షమించలేని విషయం.

బోగస్ కార్డులను ఏరివేయలేని ప్రభుత్వ అసమర్థత వల్ల రాష్ట్ర ప్రజానీకం కనీసం 600 కోట్ల రూపాయల అదనపు భారం భరించాల్సి వస్తున్నది. గెల్చి నెల తిరగక ముందే ఎన్టీఆర్ ఒకే ఒక ఆర్డినెన్స్ ద్వారా 180 కోట్ల పన్నులు పెంచేశారు. సేల్స్ టాక్స్ సర్‌ఛార్జిని 10 నుంచి 20 శాతానికి పెంచడం వల్ల ధరలు పెద్దగా పెరగవని అమాత్యవర్యులు చిలక పలుకులు పలుకుతున్నప్పటికి వాస్తవంలో ధరలు చుక్కల నంటుతున్నాయి. పెట్రోలు విషయమే చూడండి. సర్‌ఛార్జి పెంపు వల్ల ప్రభుత్వ లెక్క ప్రకారం 0.70 శాతం, అంటే 14 పైసలు పెరగాలి. కాని ఆర్డినెన్స్ వచ్చిన క్షణం నుంచి పెట్రోలు ధర అర్ధ రూపాయి పెరిగింది. ఇది 2.5 శాతంతో సమానం. ఈ లెక్కన ప్రభుత్వం సర్‌ఛార్జి పెంచిన 140 రకాల వస్తువులపై ప్రజలు ఎన్ని వందల కోట్ల రూపాయలు అదనంగా చెల్లించాల్సి వుంటుందో వూహాతీతం. కరెంట్ కనెక్షన్ ఛార్జీలనూ రెట్టింపు చేశారు. గృహావసరాల కంటే విధి లేదు కాబట్టి భరిస్తారు; పరిశ్రమలకూ కిలోమీటరు లైనుకు రెండు లక్షల ధర పెంచడం వల్ల పలు పరిశ్రమలు సంక్షోభంలో పడతాయి. రాష్ట్రంలో కొత్తగా పరిశ్రమలు పెట్టబోయే వారు పునరాలోచించు కోవలసిన దుస్థితి ఏర్పడుతుంది. అసలే కరెంట్ కోతతో, ప్రత్యామ్నాయ జనరేటర్ సౌకర్యం తప్పనిసరి కావడంతో




పరిశ్రమల ప్రాజెక్ట్ వ్యయం 10 నుంచి 15 శాతం వరకు పెరుగుతున్నది. సర్వీసు ఛార్జీలు, మీటరు ఛార్జీలు పెంచితే పరిశ్రమలు మూతపడి పోతాయి.

ఆర్థిక సరళీకృత విధానాలతో, భారతీయ పరిశ్రమలు ప్రపంచ మార్కెట్‌లో పోటీ పడడానికి తగిన వాతావరణం కల్పించడం కోసం ఒక ప్రక్క కేంద్ర ప్రభుత్వం పన్నులు తగ్గించి ప్రోత్సహిస్తుంటే, రాష్ట్రం మాత్రం పరిశ్రమలను చావబాదే నిర్ణయాలు తీసుకోవడం ఆత్మహత్యా సదృశం. పరిశ్రమలు మూతపడితే పన్నులు దండలేదు; పన్నులు లేకుంటే ప్రభుత్వానికి ఆదాయం వుండదు. పరిశ్రమలు మూతపడితే నిరుద్యోగం పెరిగిపోతుంది. అందువల్ల కొనుగోలు శక్తి హరించుకొని పోతుంది. దానితో నడిచే పరిశ్రమలకూ వ్యాపారం వుండదు. తద్వారా పన్నుల ఆదాయం మరింత తగ్గుతుంది. ఇదొక వలయం వంటిది.

సబ్సిడీ బియ్యం పథకం సక్రమంగా అమలు చేయలేని చేతకానితనంతో పన్నులు పెంచి, కరెంట్ ఛార్జీలు పెంచి పరిశ్రమలు మూతపడే పరిస్థితి కల్పిస్తే - అభివృద్ధి అడుగంటి పోతుంది. రాష్ట్ర ప్రజలందరూ తెల్ల కార్డులకు అర్హులై, బియ్యం కోసం క్యూలలో నిల్చుకో వలసిన దుర్గతి ఏర్పడుతుంది. అందరూ దరిద్రులు గానే బతుకుతారు. ప్రభుత్వం కళ్ల తెరుచుకొని, బోగస్ కార్డులను కఠినంగా ఏరిపారేయడం ద్వారా ఆ పథకం ఖర్చును తగ్గించుకోవాలి. తద్వారా కొత్త పన్నులు విధించే అవసరాన్ని నివారించాలి. అదిచేత కాకుంటే అంతా అస్తవ్యస్తమే!




5-1-1945

సం :0-1-6 పేజీలు : 8

### ముఖ్యవార్తలు

గాంధీజీ వారం రోజులుగా జ్వరం, దగ్గు, వాంతులతో బాధ పడ్డారు. ప్రస్తుతం కొంచెం నిమ్మళంగా వున్నా, యింకా కోలు కోలేదని డాక్టర్లు ప్రకటించారు.

* * *

మద్రాస్ కేసరి విద్యాలయముకు శ్రీ.యస్. కేసరిగారు, యిది వరలో యిచ్చిన 60 వేలుగాక, తిరుగా 50 వేల రూపాయల విపుడు స్కూలుకు విరాళంగా యిచ్చారు.

* * *

బెజవాడలో బట్టల దుకాణములందు డిసెంబరు జనవరి నెలల్లో ఒక కోటి రూపాయల బట్టల వ్యాపారము జరిగెది. ఈ సంవత్సరం బెజవాడలో గల కొట్లు అన్నిటి యందు ఒక లక్ష రూపాయల గుడ్డ కూడా లేదు. కొట్లు అన్నియు ఖాళీగానే కనబడుచున్నవి. దీనికి కారణం బొంబాయి, అహమ్మదాబాదు లందు గల మిల్లుల నుంచి సరియయిన విధురల లేకపోవుట అచ్చట బ్లాకుమార్కెట్టు ఎక్కువ అగుట వల్లనే అని తెలియుచున్నది.

### నెల్లూరు ముచ్చట్లు

#### అవీ- ఇవీ

నెల్లూరు స్టోన్‌హౌస్ పేట గుండపల్లి రామానుజం తలపిన్ను 0-0-1 జాస్తికి అమ్మినాడని 31-12-44 తేది గజపతి నాయుడు గారి కోర్టు 100

### 50 ఏళ్లక్రితం ఈవారం

రూపాయల జుల్మానా, 1 నెల కఠిన శిక్ష విధించింది.

చంద్రా & కో., కోటిలింగం గొడుగు కేసులో హైకోర్టు శిక్ష పూర్తిగా రద్దు చేయలేదట. జైలులో వున్నమటుకు శిక్ష చాలునని తక్కిన శిక్ష మాత్రం రద్దు జేస్తూ, జుల్మానా ఖాయం జేశారట.

* * *

నెల్లూరు రైల్వే స్టేషన్‌లో అంగడి అతను పి.ఎస్. గోవింద స్వామి ప్యాసింగ్ షో. సిజర్ సిగరెట్లు 0-0-6 జాస్తి అమ్మినాడని గజపతినాయుడు గారి కోర్టు రు.200 లు జుల్మానా విధించెను. కట్టకుంటె 4 మాసాలు శిక్ష.

కావలి 10 పేజీలో

# బియ్యంతో సాంఘిక న్యాయం జరుగుతుందా?

తెలుగుదేశం ప్రభుత్వం ప్రవేశ పెట్టిన కిలో 2రూపాయల బియ్యం పథకం అసంబద్ధంగా వుంది. బహిరంగ మార్కెట్‌లో కేజీ బియ్యం 10 రూపాయలు పలుకుతూ ప్రభుత్వం లెవీ ధర 7.50 వరకు చెల్లించాల్సిన పరిస్థితి ఈ పథకాన్ని ప్రవేశ పెట్టడంలో అర్థంలేదు. కొంత మందికి 2రూపాయలకు బియ్యం దొరకడం మరికొంత మంది 10రూపాయలు పెట్టి కొనడం ఏమి న్యాయం? కిలో రెండు రూపాయల బియ్యం వల్ల నిజంగా సాంఘిక న్యాయం ఒనకూడు తుందా? పైగా ఈరోజుల్లో ప్రజలలో కొనుగోలు శక్తి బాగా పెరిగింది. అన్ని వృత్తుల వాళ్లు రేట్లు విపరీతంగా పెంచేశారు. వుదాహరణకు రిక్షాకు తక్కువరేటు 5రూపాయలు అడుగుతున్నారు. బేల్దారులు రోజుకు 60నుంచి 70రూపాయలు తీసుకొంటున్నారు. అడ కూలి వాండ్లు 40రూపాయలు తీసుకొంటున్నారు. ఈ పరిస్థితులలో ఎవరూ కొనే శక్తిలేక అల్లాడడం లేదు. పేదరికానికి అర్థం మారిపోయింది. పనిచేసే వారంతా తినగలుగు తున్నారు. అటువంటప్పుడు బియ్యం ఎవరిని వుద్ధరించడానికి? బియ్యంతోపాటు చిల్లర వస్తువులపై 180కోట్లు పెంచారు. ప్రజలకు ఇక ఎక్కడ మిగిలి వస్తుంది. పోనీ బియ్యం పథకం వల్ల పొదుపు చేసి జాతి ప్రయోజనాలకు వుపయోగిస్తారా? సినిమాలకు జల్సాలకు ఖర్చు చేస్తారు. కాబట్టి ఈ విధానం తొలగించడం మేలు; ఆ డబ్బు రాష్ట్రాభివృద్ధికి వుపయోగించడం శ్రేయస్కరం.

నెల్లూరు -బి.వి.రాధాకృష్ణయ్య.

### ఎన్టీఆర్ పని అప్పుడే అయిపోయింది!

ఎన్టీరామారావు ఎన్నికల సభల్లో మద్య నిషేధం విధిస్తానని కిలో బియ్యం రెండు రూపాయలకు




అమ్మిస్తానని ప్రజలకు వాగ్దానం చేసి అధికారం చేజిక్కించుకొన్నారు. దబ్బెక్కడ నుంచి తెస్తావని ప్రజలు అయన్ని నిలదీసిన పాపాన పోలేదు. గుడ్డి నమ్మకంతో ఓట్లిచ్చి గెలిపించారు. ఎన్నికల్లో పోటీ చేసిన ప్రతి తెలుగుదేశం అభ్యర్థి అర డజను మంది డజను వరకు వాగ్దానాలు చేసిన వారే. అధికారానికి వచ్చిన తెలుగుదేశం పార్టీ నిధులు సమకూర్చు కోవడంలో 'ఎట్లా, ఎట్లా' అని మల్లగుల్లాలు పడుతున్నారు. ప్రధానమంత్రి, రాష్ట్రపతిని మర్యాద కోసమని కలుస్తూనే తన పథకాలకు నిధులు కావాలన్నారు. ఇప్పుడేమో బియ్యం ఇవ్వకపోతే విప్లవ మొస్తుందని కేంద్రంపై ప్రజలను ఎగద్రోలు తున్నారు. వుద్యోగులు ఆ మహాను భావుడి దెబ్బకు భయపడి చచ్చారు గాని, వుద్యోగులతో ఎన్టీఆర్ ఎలాగోలా సర్దుకున్నారు. రాష్ట్రంలో నిధులు సమకూర్చు కోవడానికి అనేక మార్గాలు లేకపోలేదు. కావలసింది ధైర్యం. గుప్త ధనాన్ని వెలికి తీయడం ఒక మార్గం. బకాయిలను వసూలు చేయడం మరొక మార్గం. బియ్యం పథకం, మద్య నిషేధం ప్రగల్భాల పథకాలే. ముందు ముందు ప్రజలకు ఈ విషయం బోధ పడుతుంది.

కోవూరు - బి.అనుపమ

### తెలుగుదేశం పదికాలాల పాటు వుండాలి!

జాతీయ పార్టీలు, మత పార్టీలు, కుల పార్టీలను త్రోసి ఏకగ్రీవంగా తెలుగుదేశం పార్టీని

కావలి 6 పేజీలో

# అన్న పేరు చిరకాలం నిల్చేలా ఎన్టీఆర్ నగర్ సమగ్రాభివృద్ధి!

కిలో రెండు రూపాయల బియ్యం పథకాన్ని నెల్లూరులో ప్రారంభించను ఎన్టీఆర్ నగర్‌ను ఎంచుకొన్నారు రమేష్ రెడ్డి. కొత్త సంవత్సరం సాయం సంధ్య వేళ ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో ఎమ్మెల్యే మాట్లాడారు. నా నియోజక వర్గంలో చాలా మందికి రేషన్ కార్డుల లేవు. పలువురు పేదలు నా వద్దకు వచ్చి కార్డులు లేనందున రేషన్ బియ్యం అందడం లేదంటున్నారు. ఆ పేదల బాధ నాకు తెలుసు; రేషన్ కార్డుల లేని వారి దరఖాస్తులను, దయార్ద్ర హృదయులైన కలెక్టర్ సతీష్ చంద్ర పరిశీలిస్తారని విన్నవించి వల్లగా తన మీద పెరుగుతున్న

భారాన్ని కలెక్టర్ మీదకు తోసారు రమేష్‌రెడ్డి. ఇది నూతన సంవత్సరాన్ని పురస్కరించుకొని ప్రజల కోసం ఎమ్మెల్యేగా అడిగే తొలి కోర్కె అని కలెక్టర్‌తో చెప్పారాయన. బోగస్ కార్డులు ఎక్కువగా డీలర్ల వద్ద వున్నాయి. ఆ కార్డులను మహిళలే పట్టించి ఇవ్వాలి. అన్న గారి పాలనలో ప్రవేశ పెట్టిన అతి గొప్ప పథకం ఇది. రేషన్ బియ్యం తక్కువ ధరకు లభించడం వల్ల ప్రజలు డబ్బు పొదుపు చేయగలరన్న ఆశాభావాన్ని వ్యక్త పరిచారు. ఎన్టీ రామారావు పేరుతో వున్న నగర్‌లోని అన్ని సమస్యలనూ తీర్చి ఎన్టీఆర్ పేరు చిరస్థాయిగా నిలిచేలా చేస్తానని ఎమ్మెల్యే వాగ్దానం చేసారు. ఇన్‌ఛార్జ్ కలెక్టర్ సతీష్ చంద్ర మాట్లాడుతూ బియ్యం, సంపూర్ణ మద్య నిషేధం పథకం వల్ల పేద ప్రజల ఆర్థిక పరిస్థితి కుదుట పడ గలవన్నారు. బోగస్ కార్డుల ఏరివేతకు

ప్రజలు సహకరించాలని కోరారాయన. జిల్లా పౌర సరఫరా అధికారి భరత్ రెడ్డి, విజిలెన్స్ ఎ.ఎస్.పి. గోపాలకృష్ణ, దేశం నాయకులు శ్రీధర కృష్ణారెడ్డి, కోదండ రామయ్య, జ్ఞానశేఖర్ తదితరులు పాల్గొన్నారు.

## ఆనందమూర్తి స్మారక సభ

వి.ఆర్.సి. ఫిజిక్స్ లెక్చరర్ దివంగత స్వయంపాకుల ఆనంద రామమూర్తి జ్ఞాపకార్థం 30 తేది ఆయన పేరిట ఒక ఫౌండేషన్ ప్రారంభించారు. కార్యక్రమంలో అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన శాస్త్ర వేత్తలు బెంగుళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన ప్రొఫెసర్ ఎస్.వి. సుబ్రహ్మణ్యం, ఎస్.వి. మహిళా యూనివర్శిటీ రిజిస్ట్రార్ శ్రీ ప్రభాకర రెడ్డి, ఎన్.కె. మాజీ ప్రిన్సిపాల్ ఎన్.వి. సుబ్రహ్మణ్యం పాల్గొన్నారు.

### నెల్లూరు సంగతులు

సమావేశానికి వి.ఆర్. కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ డి. గోపాలకృష్ణ మూర్తి అధ్యక్షత వహించారు. స్వాగతం పలికిన భౌతిక శాస్త్ర శాఖాధిపతి ఎం. కోదండ రామిరెడ్డి మాట్లాడుతూ ఆనంద రామమూర్తి మహోన్నత వ్యక్తి. ఆయన ఫిజిక్స్ శాఖకు చేసిన సేవలకు జ్ఞాపకార్థంగా ఈ ఫౌండేషన్‌ను పెడుతున్నట్లు చెప్పారు. ఫౌండేషన్ తరపున భౌతిక శాస్త్రంలో డిగ్రీలో అగ్ర శ్రేణి మార్కులు తెచ్చుకొన్న విద్యార్థులకు వెయిరూపాయల స్కాలర్ షిప్ ఇవ్వడంతో పాటు, ప్రముఖ శాస్త్ర వేత్తలతో ప్రతి యేడాది స్మారక వుపన్యాసం ఏర్పాటు చేయనున్నట్లు చెప్పారు. వి.ఆర్. కళాశాల కమిటీ అధ్యక్షులు తూపిలి సుందర రామిరెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. డాక్టర్ డి. రామచంద్రా రెడ్డి చివరన వందన సమర్పణ చేసారు.

### సచ్చిదానందస్వామి జ్ఞాన బోధ

పూజ, అర్చన, ధ్యానం, ఆధ్యాత్మికత, సామాజిక సేవ, ధర్మబద్ధమైన జీవితం జీవిత పరమావధిగా భావించి ఆచరిస్తే ప్రతి మానవుడు ధన్య జీవుడవుతాడని శ్రీ గణపతి సచ్చిదానంద స్వామిజీ చెప్పారు. సుజాతమ్మ కాలనీలోని కృష్ణ మందిరంలో భక్తులను వుద్దేశించి మాట్లాడారాయన. యజుర్వేదంలో మానవుడు ఆచరించాల్సిన స్వధర్మాన్ని గూర్చి విశదీకరించ బడి వుంది. వుపవాస కాండలో అర్చన, హోమం, దేవతలకు పూజలు తదితర పవిత్ర విధులు వివరించి వున్నట్లు స్వామిజీ చెప్పారు. జ్ఞాన కాండలో గురువు ప్రబోధించిన శ్రవణం, మననం, మదనం, విషయాల ద్వారా గ్రహించింది ఆచరిస్తే శాంతి పరిస్థితి, ఆనందం లభిస్తుందన్నారు. ఈ విషయంలో విష్ణుదత్తునకు దత్తాత్రేయులు వివరించినట్లు చెప్పారు. శ్రీ కృష్ణుడు బోధించిన భగవద్గీత హిందువులకు ప్రామాణిక శాస్త్రంగా నిలిచి వుంది. కృష్ణుడు ఆశారహితుడని చెప్పారు. జ్ఞాన బోధ ట్రస్ట్ బోర్డ్ ఉపాధ్యక్షుడు కొండా బలరామి రెడ్డి కార్యక్రమాన్ని పర్యవేక్షించారు.

### కొత్త వత్సర ప్రారంభాన ఓ చెల్లి కన్ను మూసింది!

యుగయుగాలుగా స్త్రీ పురుష కౌష్టానికి బలౌతూనే వుంది భారత

(10 పేజీలో)



వి.ఆర్. కాలేజి మాజీ లెక్చరర్ ఆనంద రామమూర్తి సంతాప సభలో పాల్గొన్న తూపిలి సుందర రామిరెడ్డి, డి.గోపాలకృష్ణ మూర్తి, యస్.వి. సుబ్రహ్మణ్యం, ప్రొ. వై.ప్రభాకర రెడ్డి

## శకునగుడు

* జిల్లా ఎమ్మెల్యేలకు పొద్దు తెలియడం లేదు!
* డాక్టర్ జెపి కార్డ్‌లెస్ గ్రీటింగ్

నెల్లూరు జిల్లా ఎమ్మెల్యేలు అప్పుడే వివాదాల్లో చిక్కుక పోతున్నారు. గెల్చి నెల కాలేదు; ప్రమాణ స్వీకారమూ జరగలేదు; ఎమ్మెల్యే పదవి హద్దు లేమిటో, నిబంధన లేమిటో, సౌకర్యాలేమిటో, సుఖాలేమిటో తెలియదు; గెల్చిన వారిలో ముప్పాతిక భాగం శాసన సభా భవనాన్ని తొలిసారిగా చూడబోతున్నారు. ఈ తెలిసీ తెలియని తనమే వారిలో ఆత్రం పెంచుతు న్నట్లుంది. అది నచ్చి ఆత్రం కాదు. మహా ఆత్రం. కొందరు కొత్త ఎమ్మెల్యేలు నేరుగా అధికారులకే పరిమితమైన సమావేశాలలోకి వెళ్లి పోతున్నారు. కొందరైతే ఎమ్మార్వో వంటి ఆఫీసులకు వెళ్లి, ఆ అధికారి సీటులో కూర్చుంటున్నారు. ఒక ఎమ్మెల్యే - ఒక ఎమ్మార్వోను తాను చెప్పనిదే ఏ గ్రామానికీ వెళ్లకూడదని ఆదేశించారట. కొమ్మి లక్ష్మయ్య నాయుడు గారు ఒక అధికారిక సమావేశంలో ఆత్మకూరు ఎమ్మార్వోను దబాయించి పారేశారు. తాను చెప్పినదే

### డోలేంద్ర

జరగాలని శాసించారు. పెద్దుల్లోలో ఏ పని జరగాలన్నా తాము చెప్పాల్సిందేనని ఎమ్మెల్యేలు హుకుం జారీ చేస్తున్నారు. పోలీస్ స్టేషన్లలోనూ వీరు అతిగా జోక్యం చేసుకొంటున్నారు. అరెస్ట్ చేయాలన్నా, విడుదల చేయాలన్నా, జామీను ఇవ్వాలన్నా, ఆఖరకు కేసు రిజిష్టరు

(6 పేజీలో)

# మాకు గెలుపు ఓటములు రాత్రి పగలులతో సమానం!

టౌన్‌లోని కాంగ్రెస్ పార్టీ కార్యకర్తల్లో చైతన్యం తెచ్చేందుకు బాగుంట, ఆనం వర్గాలు విడివిడిగా సమావేశాలు నిర్వహిస్తున్నాయి. 3 తేది సాయంత్రం ఆచారివీధిలోని క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో జరిగిన 33, 34 వారుల సమావేశం హంగామాగా జరిగింది. డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి, మాజీ మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి, వివేకానంద రెడ్డి, పుట్టా బలరామిరెడ్డి, మంకు వెంకటేశ్వర్లు, పసుపులేటి విజయకుమార్ నాయుడులతో పాటు పలువురు మాజీ కౌన్సిలర్లు పాల్గొన్నారు. ఆనం సంజీవ రెడ్డి మాట్లాడుతూ మొన్నటి ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఓడిపోలేదు; అభ్యర్థులు మాత్రమే ఓడిపోయారు. మహిళల ఓట్లు, కిలో రెండు రూపాయల బియ్యం పథకం, సంపూర్ణ మద్య నిషేధం వంటివి కాంగ్రెస్ పార్టీ ఓటమికి కారణాలన్నారు. ప్రభుత్వం పై వున్న వ్యతిరేకత వల్ల పార్టీ ఓడి పోయినట్లు చెప్పారాయన. జిల్లాకు ఇన్‌ఛార్జ్ మంత్రి తొమ్మిదిసార్లు వచ్చారు. వచ్చేటప్పుడు నాలుగు రోజుల ముందుగా జిల్లా కాంగ్రెస్‌కు సమాచార మివ్వమని చెప్పినా పట్టించు కోలేదు. కార్యకర్తలు ప్రభుత్వం పై వత్తిడి తెస్తేనే అది సక్రమంగా పని చేస్తుంది. అప్పుడు అందరి పనులు జరుగుతాయి. కార్యకర్తలు ప్రభుత్వం పక్షాన నిలుస్తారని వివరించారు. ఆ విధంగా జరగ లేదు కాబట్టి ప్రజలు మంచి గుణపాఠం నేర్పారని చెప్పారు.

ఆనం రామనారాయణ రెడ్డి మాట్లాడుతూ కాంగ్రెస్ పార్టీలోని కలతలు, విభేదాల వల్ల మాత్రమే పార్టీ ఓటమి చవి చూసింది. పార్టీని పునర్నిర్మించే బాధ్యత కార్యకర్తల పై వుందన్నారు. సింహపురి సేవా సమితి కన్వీనర్ ఆనం వివేకానంద రెడ్డి మాట్లాడుతూ గెలుపు, ఓటములు

### ఆనం వివేకానంద రెడ్డి స్వంత జోలపాట!

రాజకీయాల్లో రాత్రి, పగలు వంటి వన్నారు. రాజకీయాల్లో తమ కుటుంబం అధికారంలో వున్న రోజుల కన్నా అధికారంలో లేని రోజు లెక్కువని, కష్టాల్లో పాలు పంచు కొనేందుకు తాము ఎల్లప్పుడూ సిద్ధంగా వున్నట్లు చెప్పారు. మునిసిపల్ మాజీ వైస్ ఛైర్మన్ పుట్టా బలరామిరెడ్డి ఈ కార్యకర్తల సమావేశానికి అధ్యక్షత వహించారు.

# "పోలీసు స్టేషన్‌కైనా వస్తా!"

టౌన్‌లోని కాంగ్రెస్ కార్యకర్తల పై ఈగ వాలినా తాను సహించేది లేదని, వారి న్యాయమైన సమస్యల పరిష్కారం కోసం అవసరమైతే పోలీస్ స్టేషన్లకైనా వస్తానని సి.వి. ప్రసన్న రెడ్డి కార్యకర్తలకు భరోసా ఇచ్చారు. 3 తేదీ సాయంత్రం సంతపేటలో జరిగిన కాంగ్రెస్ పార్టీ కార్యకర్తల సమావేశంలో పాల్గొని ప్రసంగించారు. రాజకీయాల్లోకి రాక ముందు నుంచి ప్రజా సేవ చేస్తున్నాను అసెంబ్లీ ఎన్నికల్లో ఓడిపోయినా బాధలేదు; ప్రజా సేవ చేస్తూ కాంగ్రెస్ పార్టీ అభివృద్ధికి పాటు పడతానని చెప్పారాయన. ఎమ్మెల్యేగా ఎన్నికైతే అధికారికంగా మరికొన్ని పనులు చేయవచ్చునని ఆశపడినట్లు చెప్పారు. కార్యకర్తలందరూ కలసి మెలసి పని చేసి రాబోయే మునిసిపాలిటీ ఎన్నికల్లో కాంగ్రెస్ విజయం కోసం పోరాడాలన్నారు. కార్యక్రమానికి మాజీ మునిసిపల్

### ప్రసన్నరెడ్డి లాలిపాట!

కౌన్సిలర్ పత్తి రవీంద్ర బాబు అధ్యక్షత వహించారు.

### జిల్లా హిందీ ప్రచారక మండలి కార్యవర్గం!

జిల్లా హిందీ ప్రచార మండలి సర్వసభ్య సమావేశం 25 తేది సర్వోదయ కళాశాలలో జరిగింది. మండలి కార్యదర్శి ఎ. వెంకట సుబ్బయ్య మండలి వార్షిక నివేదికను సమర్పించారు. ఇటీవల రాష్ట్ర ప్రభుత్వంచే ఉత్తమ ఉపాధ్యాయునిగా ఎన్నిక కాబడిన బి. మల్లావధాని సన్మానించారు. అనంతరం జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో బొమ్మిశెట్టి యలమందయ్యను అధ్యక్షునిగా, గాదంశెట్టి శ్రీరాములు, శ్రీమతి సి. కృష్ణవేణిలను ఉపాధ్యక్షులుగా; ఎ. వెంకట సుబ్బయ్యను కార్యదర్శిగా; సి.ఎల్. కాంతారావు, కె.వి. కృష్ణయ్యలను సహకార్యదర్శులుగా ఎన్నుకొన్నారు.

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## రంగడి గుడిలో వైకుంఠ ఏకాదశి

నెల్లూరు, శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి దేవాలయంలో జనవరి 12 తేది ముక్కోటి సందర్భంగా వైకుంఠ ఏకాదశి ద్వారదర్శనం కోసం ప్రత్యేక ఏర్పాట్లు జరుగుతున్నాయి. అనం వివేకానంద రెడ్డి ఉభయకర్త.

## చక్కెర మంత్రి

చక్కెర మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్నకుమార రెడ్డి 4 తేది నెల్లూరు వచ్చారు. 8 తేది వరకు వుంటారు. ఆయన గెస్ట్ హౌస్‌లో దిగడం లేదు. తన ఇంట్లోనే బస చేస్తున్నారు. మంత్రిత్వపు హంగు, ఆర్భాటాలూ కోరడం లేదు.

సబ్సిడీ బియ్యం పథకానికి విరాళాలు సేకరించాలని ఎన్టీఆర్ ఇచ్చిన పిలుపు మేరకు తన ఏడాది జీతం 75 వేల రూపాయలు ముందుగా ముఖ్యమంత్రికి సమర్పించారు ప్రసన్న కుమార రెడ్డి. ఎందరి జీతాలు కలిస్తే 1200 కోట్లు జమ కూడుతుంది చెప్పండి!

## కొత్త ఎస్.పి.

నెల్లూరు జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌గా శ్రీ జె. పూర్ణచంద్ర రావు పదవీ బాధ్యతలు స్వీకరించారు. మంగళగిరి ఎపిఎస్‌పి బెటాలియన్ కమాండెంట్‌గా వుంటూ ఇక్కడకు బదలీ అయ్యారాయన. బాపట్ల వారి స్వస్థలం. ఎస్‌పిగా తొలి పోస్టింగ్ ఇదే. ప్రొద్దుటూరు, కరీంనగర్, రంగారెడ్డిలలో ఎఎస్‌పిగా పనిచేశారు.

పూర్ణచంద్ర రావు ప్రతిభావంతుడు. ఆయన ఒకే సారి ఐఎఎస్, ఐఎఫ్ఎస్, ఐపిఎస్‌లకు ఎన్నికైనారట. పోలీసు శాఖపై మక్కువతో ఈ సర్వీసులోకి వచ్చారు. ఆయన పని తీరెట్లా వుంటుందో వేచి చూద్దాం!

పాత ఎస్‌పి శ్రీ రమణామూర్తిని సిఐడి విభాగానికి బదలీ చేశారు. మాగుంట కుటుంబీకులకు లోబడి పోయిన వాడిగా ఆయన నింద తల పై వేసుకుని వెళ్తున్నారు.

## సిఎం పిఏగా నెల్లూరు అధికారి

నెల్లూరు ఎస్‌సి కార్పొరేషన్ ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ శ్రీ సుబ్రహ్మణ్యం ముఖ్యమంత్రి పిఏగా నియమితులైనారు. గతంలో కృష్ణా జిల్లా ఆర్‌డిఓగా వున్నప్పుడు సుబ్రహ్మణ్యంకు ఎన్టీఆర్‌తో పరిచయం వుండేదట. ఆ చనువుతో ఇప్పుడాయన్ను పిలిపించారు.

## 60 వేల ఎకరాలకు రెండవ పంటకు నీరు

కనిగిరి రిజర్వాయర్ క్రింద రెండవ పంటకు 60 వేల ఎకరాలకు నీరందించాలని నిర్ణయించారు. 5 తేది కోవూరులో జరిగిన నీటి పారుదల రైతు సదస్సులో కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర ఈ విషయం ప్రకటించారు. సోమశిల ప్రాజెక్టులో ఇప్పుడు 27 టిఎంసిల నీరు వుంది. ఇంక కొత్తగా వానలు పడే అవకాశం లేదు కాబట్టి, వున్న నీటితోనే సర్దుకోవాలి. గత సంవత్సరం ఈ చెరువు క్రింద లక్షా 40 వేల ఎకరాలకు నీరు సరఫరా చేశారు.

సమావేశంలో ఇంజనీర్ల పై పలు ఆరోపణలు వచ్చాయి. జిఇ ఓజిలి గోవింద రెడ్డి, ఇతనితో కలసి కుమ్మక్కై తూర్పు కాలువను తెగ గొట్టించి, పూడిక పనులు చేసినట్లు దొంగ బిల్లులు సృష్టించాడని రైతులు ఆరోపించారు. కలెక్టర్ గారు దీని పై కావలి ఆర్‌డిఓను విచారణకు నియమించారు.

## ప్రేమికుల ఆత్మహత్య

పొదలకూరు రోడ్డుకు చెందిన రహీం (19) మొబీన్ (17) అనే యువ ప్రేమికుల జంట తమ పెళ్లికి పెద్దలు నిరాకరించారనే దిగులుతో సైనేడ్ మ్రింగి ఆత్మహత్య చేసుకున్నారు.

రహీం సైకిల్ షాపులో పనిచేస్తాడు. మొబీన్ అతని అత్త కూతురే. ఇద్దరికి ప్రేమ కుదిరింది. కాని మొబీన్‌కు సంబంధించిన పెద్దలు పెళ్లికి ఒప్పుకోలేదు. వారు కువైట్‌లో వున్నారట. విసిగిపోయి ఆ-రి అఘాయిత్యానికి పాల్పడ్డారు పాపం! యువకుల ప్రేమ విషయంలో పెద్దలు కొంచెం సామరస్యంగా, సహనంతో వ్యవహరించ కుంటే ఇటువంటి విషాదాలు తప్పవు.

## కోర్టు ఎదురుగా సయీద్ హత్య

నెల్లూరు టౌన్ యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు, మంచి ఆర్టిస్టు సయీద్ అహమ్మద్ (40) 31 తేది సాయంత్రం కోర్టు ఎదురుగా దారుణ హత్యకు గురైనాడు. కలెక్టరేట్ ప్రాంగణంలోని కోర్టులో తన న్యాయవాదితో మాట్లాడి, ఆచారి వీధి వైపు మెట్లు దిగి వెళ్తున్న సయీద్‌ను ఐదారుమంది రౌడీలు చుట్టు ముట్టి, కత్తులతో ఛాతీ పైన, వీపు పైన పొడిచి చంపేశారు. ఆ సమయంలో కరెంట్ కూడా లేక పోవడంతో హంతకుల పని సులువైంది. ఒక్కరూ చిక్కకుండా తప్పించుక పోయారు.

సయీద్ తమ్ముడు రఫీ 4 నెలల క్రితం జరిగిన ఒక పోలీసు కానిస్టేబిల్ హత్యలో ముద్దాయి. ఆ కేసుకు సంబంధించి జైలులో వున్న తమ్ముడికి బెయిల్ కోసం కోర్టుకు వెళ్ళాడట. అది గమనించి హంతకులు పథకంతో వచ్చి చంపేశారు. నిజానికి సయ్యీద్‌కు, ఈ రౌడీ గ్యాంగు తగాదాలతో పెద్ద సంబంధం లేదు. తన తమ్ముణ్ణి బెదరించాడని చనిపోయిన కానిస్టేబిల్ మీద ఎస్‌పికి ఒక సారి ఫిర్యాదు చేశాడట. దాని పై అతణ్ణి అప్పుడు సస్పెండ్ చేశారు. ఆ సస్పెన్షన్‌లోనే హత్య జరిగింది.

టౌన్‌లో రౌడీ గ్యాంగుల దౌర్జన్యాలు మళ్లీ పెరుగుతున్నాయి. పోలీసులు కఠినంగా వ్యవహరించ కుంటే ప్రమాదమే!

## మళ్లీ అనారోగ్యం పాలైన ఖైదీలు

నెల్లూరు జైలుకు చెందిన ఏడుగురు ఖైదీలు మళ్ళీ అనారోగ్యంతో ఆస్పత్రి పాలైనారు. జైలులోని బావుల్లో పురుగులు చేరి నీరు కంపు కొడుతున్నదట. దానినే వంటా వార్పుకు వాడుతున్నారు. ఇంకొక

కాలమ్ 6 పేజీలో

కాంగ్రెస్
2 పేజీ తరువాయి

వెంటనే హరిజన అత్యాచారం కేసులో ఇరికించారు. పోలీసు ఎస్ఐ- తనపై పత్రికలు వస్తున్నాయని, హరిజనులపై అత్యాచారమన్నది తప్పుడు కేసని తనకు తెలిసినా తానేమీ చేయలేనని చెప్పాడట.

ఆత్మకూరులో కొమ్మి లక్ష్మయ్య నాయుడుగారు మరీ దౌర్జన్య పూరితంగా ప్రవర్తిస్తున్నారు. కాంగ్రెస్‌కు పనిచేసిన వారిని ఏరి ఏరి వెతికివెతికి హింస పెడ్తున్నారు.

మండల, జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గాల నిర్ణయంలో ఎమ్మెల్యేలు తమకు తోచినట్లు గీతలు పెడుతున్నారు. కలెక్టర్ సమక్షంలోనే వారు దబాయించి మరీ తాము చెప్పిన గ్రామాలను,తాము చెప్పిన నియోజక వర్గంలో కలుపుతున్నారు. కలెక్టర్ కూడా నిస్సహాయంగా చూస్తూ వుండిపోవలసి వస్తున్నది.

ఇటువంటి రాజకీయ దౌర్జన్యకర పరిస్థితులలో కాంగ్రెస్ పార్టీ సమైక్యంగా వుండి తీరాలి. నాయకులు తమ వ్యక్తిగత విబేధాలు విస్మరించి కలసిపోవాలి. ఇది ప్రతి కాంగ్రెస్‌వాది అభిలాష; అవసరం కూడా!

జె.కె. రెడ్డి
2 పేజీ తరువాయి

తాను చే[illegible]ంచిన అభివృద్ధి పనులుగా గుర్తింపు పొందేవారు. టౌన్‌లో కాం[illegible]గ్రెస్‌కు మేలు జరిగి వుండేది. కాని ఆయన ఆ విషయంలో శ్రద్ధ చూపలేదు. నిధులు కూడేసి, పనులు రెడీ అయితే చేయించాడుకాని, మొదలు పెట్టడానికి అధికారులను తరమలేక పోయాడు. ఆ అశ్రద్ధ ఇప్పుడు రమేష్‌రెడ్డి అదృష్టంగా పరిణమించింది. ఎమ్మెల్యేగా గెల్చి గెలవగానే టౌన్‌లో అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించినవాడిగా ఆయన ప్రజల గుర్తింపు పొందగల్గుతున్నాడు. దేనికైనా ప్రాప్తం వుండాలి కదా!

వ్యవసాయ మార్కెట్ భవనం జంతు వధశాలల విషయం సైతం అంతే. మద్రాసు బస్టాండులో కొత్త కూరగాయల మార్కెట్, దాని భవనాలు జెకె దగ్గరుండి కట్టించినవి. ముఖ్యమంత్రిగా శ్రీ జనార్దనరెడ్డిని పిడించి నిధులు తెచ్చాడు. ఏడాది క్రితమే భవనాలు రెడీ అయినాయి. కానీ ముఖ్యమంత్రి చేత ప్రారంభోత్సవం చేయించాలనే చిన్ని కోరికతో ఇన్ని నెలలు వృధాగా పెట్టాడు. ప్రారంభోత్సవ శిలాఫలకం పైన ఇప్పుడాయన పేరు కూడా పడదు- రమేష్ రెడ్డికి అదీ అదృష్టమే. జంతువధశాల భవన సముదాయం జెకె వ్యక్తిగత కృషి. అందుకోసం ఢిల్లీ నుంచి నిధులు తెచ్చాడు. కనీసం శంకుస్థాపన ఫలకం పై కూడా ఆయన పేరు కన్పడదిప్పుడు.

అధికారులచేత పనులు చేయించే విషయంలో కాంగ్రెస్ వాదులు తెలుగుదేశం ఎమ్మెల్యేలను చూసి నేర్చుకోవలసింది చాలవుంది.

## సణుగుడు

4 పేజీ తరువాయి

ఎదురైనా ఎమ్మెల్యే చెప్పినదే జరగ వచ్చని అనిపించాలట.

కొత్తగా గెల్చిన ఎమ్మెల్యేల విషయంలోనే ఈ విలక్షణ ధోరణి, అతి ప్రవర్తన, జాలుం కన్పిస్తున్నాయి. పాత ఎమ్మెల్యేలు నలుగురూ - బల్లి దుర్గా ప్రసాద్, కలికి యానాది రెడ్డి, జక్కా వెంకయ్య, నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి రాజకీయపు ఆటు పోట్లను ఎదుర్కొన్నవారు కాబట్టి వారిని పరతరం లేదు. ప్రసన్న కుమార రెడ్డి మంత్రిగా చాలా హుందాగా ప్రవర్తిస్తున్నారు. తండ్రి నుంచి నేర్చుకున్న శిక్షణ ఇప్పుడాయనకు ఉపకరిస్తున్నట్లుంది. మాటలో కాని, నడతలో కాని అతిశయం లేకుండా, వినయంతో మెలగుతున్నారు. భేషజం ప్రదర్శించడం, సెక్యూరిటీ దడదడలు చూపి హడలు కొట్టడం, వళ్లు తెలియని వాగ్దానాలు కనిపించడం ప్రసన్న దగ్గర కన్పడదం లేదు. అందువల్లే అధికారులూ ఆయన మంత్రిత్వంలో హాయిగా వున్నారు; ఇబ్బంది పడటం లేదు.

పేర్లు చెప్పి పరువు తీయడమెందుకు కాని కొత్త ఎమ్మెల్యేలలో కొందరి ప్రవర్తన కొత్త బిచ్చగాడు పొద్దెరగనట్లే వుంది. శాసన సభ్యత్వం విలువైన పదవి. అందులో సందేహం లేదు. కానీ ఆ పదవికీ కొన్ని పరిధులున్నాయి. శాసన సభా నియోజక వర్గమంతా తమ జాగీరని, తమ ఆజ్ఞే శిలాక్షరంగా భావించి చీమైనా కుట్టాలని భావిస్తే నవ్వుల పాలౌతారు. శాసన సభ్యులు తమ నియోజక వర్గ పరిధిలోని ప్రజలకు ప్రతినిధులే తప్ప పాలకులు కాదు; అధికార యంత్రాంగం సహకారం తీసుకొని పని చేస్తేనే ఫలితం వుంటుంది తప్ప. అధికారుల నెత్తిన స్వారీ చేస్తే పలుకుబడి పెరుగుతుందని భావిస్తే బోర్లా పడిపోతారు. కొత్త మోజులో వున్న ఎమ్మెల్యేలు ఈ విషయం గమనించడం మంచిది. గెల్చి నెల కాక ముందే విమర్శించడం సబబుగా వుండదని ఆలోచన కాని, లేకుంటే కొందరు ఎమ్మెల్యేల ధోరణి నిలదీయాల్సినంత అభ్యంతర కరంగా వుంది. పద్ధతి మార్చుకుంటే వారికే మేలు.

ఇన్‌ఛార్జ్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర గారు యముడికి శివుడికి వెరువని వాడిగా తాను సంపాదించుకున్న ప్రతిష్ఠను, ఈ కొత్త ఎమ్మెల్యేల దబాయింపుకు భయపడి వదలు కుంటున్నాడా? మరి కొంత కాలం గడిచిన తర్వాత ఆ అభిప్రాయం సరైనదో కాదో పరిశీలించి చెప్తాను.

* * *

కొత్త సంవత్సరం గ్రీటింగులు పంపే అలవాటు నాకెప్పుడూ లేదు. అయినా ఎంతోమంది మిత్రులు, పెద్దలు మర్చిపోకుండా పంపుతూనే వుంటారు. వారికి తిరిగి శుభాకాంక్షలు చెప్పకుండా కృతఘ్నుడి వలె తయారౌ తున్నానన్న శంక ఎంత పీడించి నప్పటికీ, ఎందువల్లో ఈ గ్రీటింగుల సంస్కృతి నాకు వంట బట్టడం లేదు. అందువల్ల పత్రికా ముఖంగానైనా వారికి థ్యాంక్స్ చెప్పడం ధర్మం కదా?

గ్రీటింగులలో ఎప్పటి వలెనే ఈసారి డాక్టర్ జివి రెడ్డికి ఫస్ట్ ర్యాంక్ ఇవ్వాలి. ఎప్పటి కప్పుడు కొత్తదనం కనిపెట్టి గ్రీటింగ్ తయారు చేయడంలో ఆయన్ను మించిన వారు లేరు. కళాత్మక తోపాటు, దాన్ని తీర్చుకునే ఓపిక, తెంపు కూడా వున్నాయాయనకు. ఈసారి స్పెషాలిటీ - కార్డ్‌లెస్ గ్రీటింగ్. గ్రీటింగ్ కవర్ అందింది; లోపల వెతికి చూస్తే ఏమీ లేదు; ఏప్రెల్ ఫూల్ చేశామేనని కవరు పారేయ బోయేసరికి కవర్‌పై ఫ్లాప్ అడుగున ముద్రించి వుంది శుభ సందేశం. ఆయనకా ఐడియా వచ్చినందుకు అభినందించాలి.

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మి సహితంగా సింపుల్ ప్రింటెడ్ కార్డు పంపించారు. రంగుల కార్డుల ఖరీదు పెరిగి పోయిందని కాబోలు ఈసారి ఎక్కువ మంది ప్రింటెడ్ కార్డుల వైపే మొగ్గు చూపారు.

పెళ్లకూరు రామచంద్రా రెడ్డిగారి ఇఫ్‌కో ఖర్చు పెద్ద లెక్కలోనిది కాదు గదా - ఖరీదైన కార్డే వచ్చింది. చక్కెర కంటే తీపైనది ఇల్లాలి ప్రేమ అనే మంచి సందేశంతో కార్టూన్ వేసి చక్కెర వ్యాధి ప్రమాదముంది జాగ్రత్త అని హెచ్చరించారు డాక్టర్ అనిల్ కుమార్‌రెడ్డి. మిత్రుడు రావి మోహన్ చౌదరి గ్రీటింగ్ లోనూ తెలుగుదేశం అభిమానం దాచుకోలేదు. జిల్లా గ్రంథాలయ ఛైర్మెన్ శ్రీ మెట్టా చంద్రశేఖర రెడ్డి న్యూ యియర్‌ను, సంక్రాంతిని ఒకే కార్డులో కలిపేశారు.

జవహర్ భారతి, డాక్టర్ జెవి సుబ్బరాయుడు గారి సంస్కృత శ్లోకం అర్థం చేసుకోవాలంటే శ్రీమాన్ రామానుజాచారి గారిని సంప్రదించాల్సిందే! డాక్టర్ వుండేల మాల కొండారెడ్డి గారికి ఎక్కడున్నా, ఎంత ఉన్నతికి ఎదిగినా జమీన్‌రైతుపై అభిమానం తరగదు. జెఎన్‌టియు వైస్ ఛాన్సలర్ డాక్టర్ గోపాల రెడ్డి గారు సైతం జమీన్‌రైతును మర్చిపోనందుకు ధన్యవాదాలు.

కెవిఆర్ చంద్రయ్య చిరు నవ్వులే తప్ప చింతలు వుండ కూడదని ఆశిస్తూ శుభ సందేశం పంపారు. ఇండియన్ బ్యాంకు చెంచయ్య బొంబాయి నుంచి నెల్లూరు వచ్చిన తరువాత పొదుపు నేర్చుకున్నట్లున్నాడు - ఆ కార్డు చూస్తుంటే! విఆర్ కాలేజి ఎంకె గ్రీటింగు సింపుల్‌గా వుంది. ఎప్పుడూ లేనిది డిపిఆర్‌ఓ వేణుగోపాల్ నుంచి గ్రీటింగ్ వచ్చిందండోయ్! రిటైర్డ్ ప్రిన్సిపాల్ శ్రీ బి. వెంకట సుబ్బయ్య ఇంగ్లీషులో సందేశం, తెలుగులో నమస్కారం పెట్టారు. వేమారెడ్డి రామచంద్రా రెడ్డిగారు సహకార బ్యాంకు అధ్యక్షుడిగా సందేశం విన్పించారు. ఇదే ఆఖరి అవకాశం కదా!

ఇంకా ఎందరెందరో నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలిపారు. వారందరికీ పేరుపేరునా నా ధన్యవాదాలు.

### అల్లుళ్ల బేజారు

మొదటి పేజీ తరువాయి

పకడ్బందీగా ప్రభుత్వంపై పెత్తనం సంపాదించడంతో అల్లుళ్లు బేజారై పోతున్నారు. చంద్రబాబు నాయుడుకు ఆర్థిక, విద్యుత్ శాఖలు ఇచ్చినా - ఇదివరకటి వలె నిత్య వ్యవహారాలలో జోక్యం చేసుకొనే స్వాతంత్ర్యం ఇవ్వడం లేదు ముఖ్యమంత్రి. ఆ శాఖలకు సంబంధించిన విషయం తప్ప మరి దేనిలోనూ ఆయన్ను సంప్రదించడం లేదు. డాక్టర్ వెంకటేశ్వర రావు సైతం ఆ పరిస్థితే ఎదుర్కొంటున్నారు. పార్టీ విషయాల్లో కాని, ప్రభుత్వ నిర్ణయాలలో గాని ఆయన ప్రమేయమే లేదు. ఇదే పరిస్థితి కొనసాగితే తాను ఒట్టి ఎమ్మెల్యేగా మిగిలి పోతానని భయపడి ఆయన మెల్లగా లక్ష్మి పార్వతితో రాజీపడి పోయారు. మామ దర్శనమైనా మిస్ అవుతున్నారు కాని, అత్తను కలిసి రావడానికి మాత్రం పొద్దున్నే వెళ్లి వస్తున్నారు. దీని ఫలితం అప్పుడే కన్పడింది. అల్లుళ్లు ఇద్దరి మధ్య అధికార వ్యత్యాసం వుండడం మంచిది కాదనే వుద్దేశ్యంతో, ఢిల్లీలో సమన్వయ కర్త అనే పదవి సృష్టించి, క్యాబినెట్ హోదా కల్పించి, సెక్రటేరియట్‌లో ఒక ప్రత్యేక కార్యాలయం ఆయనకు కేటాయించే టట్లు ఎన్టీఆర్‌ను ఒప్పించారు శ్రీమతి లక్ష్మీ పార్వతిగారు.

సాక్షాత్తు పెద్దల్లుడే సాహిహాం అంటూ అత్తగారి కొలువులో చేరిపోతే తాము ఎంతటివారం, అని మంత్రులందరూ పోటీలు పడి రక్షమాం అంటూ ఆమె చుట్టూ చేరిపోయి వున్నారు. ఏ సమయం లోనూ కనీసం డజను మంది ఎమ్మెల్యేలు, అర డజను మంది మంత్రులకు తక్కువ కాకుండా ఆమె ఇంటర్వ్యూ కోసం బయట పడిగాపులు కాస్తున్నారు. ఆమె తిరుమల వెంకన్నను దర్శించు కోవడానికి నడిచి వెళ్తే - ఆరుగురు మంత్రులు బాడీ గార్డుల వలె వెంట నడిచారు. డిఐజి స్థాయి కల్గిన పోలీసు అధికారులు సైతం ఆమె రక్షణగా వెంట వుండినారు. ఒక మంత్రి ఆమె అలుపు తీర్చుకొనడానికి ఆగినప్పుడల్లా, మంచినీళ్లు అందించి, టవల్ చేతికిచ్చి భక్తి శ్రద్ధలతో సపర్యలు చేశాడట.

మొత్తం మీద శ్రీమతి లక్ష్మిపార్వతి తెలుగుదేశం నాయకుల చేత సర్వెంట్ల కంటే హీనంగా సేవలు చేయించు కుంటున్నారు. రోజు రోజుకీ ఆమె పెత్తనం పెరిగి పోతున్నా లోలోపల ఏడ్చుకోవడం తప్ప బయట పడలేని దుస్థితిలో వున్నారు అల్లుళ్లిద్దరూ!

### భగ్గుమన్న ధరలు

మొదటి పేజీ తరువాయి

ఎక్కువ మంది వున్నారు. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఎన్టీఆర్ ఈసారి ఉద్యోగులతో ఆచితూచి వ్యవహరించా లనుకున్నారు. ఇటీవల సచివాలయ సిబ్బంది సన్మాన సభలో కూడా ఉద్యోగుల జోలికి రానని ఎన్టీఆర్ చెంప లేసుకున్నంత పని చేశారు. కానీ 24 గంటలు గడవకుండానే ఉద్యోగుల జీతాల పెన్షన్లు మినహా ఇతరత్రా చెల్లించాల్సిన అలవెన్సులన్నీ నిలిపివేస్తూ ఆర్థిక శాఖ సర్క్యులర్ జారీ చేసింది. దీంతో అవాక్కయిన ఉద్యోగులు పత్రికా ప్రకటనలతో తమ ఆందోళన వ్యక్తం చేశారు. తెల్లారి పత్రికల ద్వారా విషయాన్ని తెలుసుకున్న ఎన్టీఆర్ ఉండబట్ట లేక తానే స్వయంగా పత్రికా కార్యాలయాలకు ఫోన్ చేసి ఉద్యోగుల అలవెన్సులను నిలిపే ప్రశ్నే లేదని ఖండించారు. ఆ తర్వాత ప్రభుత్వ ప్రతినిధి పేరుతో వివరణాత్మకంగా పత్రికా ప్రకటన కూడా వెలువడింది. వాల్యుయేడెడ్ ట్యాక్స్ విధింపు ఆర్డినెన్సు జారీ విషయంలో కూడా ఎన్టీఆర్ అనుమతి లేకుండా జరగటంతో నాలుక కరచుకున్న ఎన్టీఆర్ తిరిగి ఈ విషయమై ఖండిస్తూ పత్రికా ప్రకటన ఇప్పించారు.

### మంత్రులపై చిర్రుబుర్రులు

తనకు తెలియకుండా ప్రభుత్వ విధానాలపై ప్రకటనలు చేస్తున్న మంత్రులపై ఎన్టీఆర్ మండి పడ్తున్నారు. ఉద్యోగుల అలవెన్సుల నిలిపి వేతకు సంబంధించిన సర్క్యులర్ తనకు తెలియకుండా జారీ చేసినందుకు ఎన్టీఆర్ ఆర్థిక శాఖ మంత్రి చంద్రబాబు నాయుడ్ని తీవ్రంగా మందలించారు. అలాగే రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం అమలు కోసం ఉద్యోగుల జీతాల నైనా నిలిపి వేస్తాం అని ప్రకటించిన పంచాయితీ రాజ్ మంత్రి కరణం రామచంద్ర రావుపై ఎన్టీఆర్ చిర్రుబుర్రు లాడారు. అలాగే సంపూర్ణ మద్యపాన నిషేధానికి సంబంధించిన ఆర్డినెన్సును తనకు తెలియకుండా పత్రికలకు విడుదల చేసిన ఎక్సైజ్ మంత్రి దేవేందర్ గౌడ్‌కు కూడా ఎన్టీఆర్ అక్షింతలు వేశాడు.

ఈ అనుభవాలన్ని దృష్టిలో వుంచుకొని ఇకపై తనకు తెలీకుండా ఎటువంటి ప్రకటనలు, నిర్ణయాలు చేయరాదని ఎన్టీఆర్ తన మంత్రివర్గ సహచరుల్ని హెచ్చరించారు. అలాగే వాల్యుయేడెడ్ ట్యాక్స్‌కు సంబంధించిన ఉత్తర్వుల్ని జనవరి ఒకటో తేదీన పత్రికలకు అందజేసి నందుకు సంబంధిత అధికారులకు ఎన్టీఆర్ చీవాట్లు పెట్టారు.

### జనవాణి

3 పేజీ తరువాయి

నిప్పులా వుండేది. నిజానికి ఎన్నికల్లో ఎన్టీఆర్ అధికారం లోకి రాకూడదని మొక్కుకున్న వాళ్లలో ఉద్యోగులే మెంటున్నాయి. రెండు రూపాయల బియ్యం పథకం కోసం అదనపు వనరుల సమీకరణ పేరుతో కొత్తగా మరిన్ని పన్నుల వడ్డనకు రంగం సిద్ధ మవుతోంది. ఎన్టీఆర్ బిట్ స్పీడ్, నాటకీయ శైలికి అలవాటు పడలేక అధికారులు సతమత మవుతున్నారు.

గతంలో ఎన్టీఆర్‌కు, రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు మధ్య ఉప్పు గెలిపించారు తెలుగు ప్రజలు. ఎన్నికల వాగ్దానంలో పేర్కొన్న రెండు రూపాయల కిలో బియ్యం, మద్య నిషేధపు ఉత్తర్వులు వెంటనే అమలు చేయడం అనందించ తగ్గ విషయం. కల్లు నిషేధం పార్టీ వాగ్దానంలో లేకున్నా అమలు పరచాలి. ప్రతి మాసం 4 రోజులపాటు శాసన సభ సమావేశం కావడం ముదావహం. గత ప్రభుత్వ కాలంలో అవినీతి పరాకాష్ట నందుకొన్నది. ఇంజనీరింగ్ వ్యవస్థ సర్వ నాశనమై టెండర్లు వేసిన రాష్ట్ర రాజధానిలోనే నానా రభస జరిగింది. ఎన్టీఆర్ ప్రభుత్వం అన్ని విషయాలూ ఆలోచించి నీతివంతులైన వుద్యోగులను కీలక స్థానంలో వుంచి అవినీతి పరులను నక్సలైట్ల ఏరియాకు బదలీ చేయాలి. గ్రామీణ స్థాయి పనులను సమష్టి బాధ్యత క్రింద గ్రామస్తులకు అప్పగించడం మంచిది. గ్రామ స్థాయిలో పథకాలు సరిగ్గా అమలు జరిగినప్పుడే అభివృద్ధి కనిపిస్తుంది. ఎన్టీ రామారావు ఇదివరకటిలా కాకుండా ప్రతి ప్రధాన నిర్ణయాన్ని ఒకటికి రెండుసార్లు ఆలోచించి తీసుకొంటే ఐదేళ్లు పదవిలో వుంటారు.

నెల్లూరు - వాస్తు రామచంద్ర

### నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ తరువాయి

ప్రక్క ఆ నీళ్ల వాసన భరించలేక ఖైదీలు వారాల తరబడి స్నానం చేయడం మానేశారట. జైలు లోపల అపరిశుభ్ర వాతావరణం నెలకొని వున్నట్లుంది. వీటన్నింటి ఫలితంగా వీరు తరచు అనారోగ్యానికి గురౌతున్నారు. ఖైదీలు జబ్బుతో చస్తున్నా జైలు అధికారులలో చలనం రావడం లేదంటే వారు మనుషులేనా అన్న సందేహం కల్గుతూంది.

### వికలాంగులకు జైపూరు కాళ్లు

వికలాంగులకు కృత్రిమంగా కాళ్లు అమర్చే కార్యక్రమం ఒకటి జనవరి 20 నుంచి 25 తేది వరకు నెల్లూరులో జరుగుతుంది. జస్టిస్ అన్సారీ మెమోరియల్ సంస్థ, జిల్లా వికలాంగుల సంక్షేమ సంస్థ సంయుక్తంగా ఈ ఉదాత్త కార్యక్రమం నిర్వహిస్తున్నాయి. జైపూరు డాక్టర్ల బృందం వికలాంగులకు కృత్రిమ కాళ్లు అమరుస్తుంది. కాళ్లు లేని వారికి లక్కీ ఛాన్సు ఇది; వివరాలకు వికలాంగుల సంక్షేమ సంస్థ కార్యాలయంలో సంప్రదించండి.

గూడూరు కానిస్టేబుళ్ల గుట్టు బయటపెట్టిన పాతకేడీ

# చోరీలు చేయించి వాటాలు పంచుకొన్న పోలీసులు!

కంటే చేయమనిన చందాన దొంగతనాలను అరికట్ట వలసిన పోలీసులే దొంగతనాలు చేయిస్తున్నారన్న విషయం తెలుసుకొని పోయారు గూడూరు పౌరులు. ఇటువంటి ఘనాపాటీలైన ఖాకీలు తమ వూరిలో వున్నందుకు మహదానంద భరితులయ్యారు. స్టేషన్‌లోని పోలీసుల మధ్య వర్గాలు, పట్టుబడిన దొంగ చెప్పిన సాక్ష్యం వింటుంటే ఖాకీలు ఎంత బరి తెగించిపోయి వున్నారో అర్థమై పోతుంది. పట్టణంలోని వివిధ ప్రదేశాల్లో గత నెలరోజులుగా పది దొంగతనాలు జరిగాయి. ఎస్.ఆర్.వి సెంటర్‌లో రెండుచోట్ల, సుందర మహల్ సెంటర్‌లో ఒకేరోజు నాలుగు దొంగతనాలు జరిగాయి. మాయబజార్‌లో చిల్లరకొట్లు, మరికొన్ని చోట్ల ఇళ్లల్లో వంట పాత్రలు మాయ మయ్యాయి. బాధితులు టౌన్, టు టౌన్ పోలీస్ స్టేషన్లలో ఫిర్యాదు చేశారు. వీటి పొడుపదలేక టౌన్ ఎస్.ఐ. రవిచంద్ర హరిజనవాడకు చెందిన పాతకేడి నాగన్నను అదుపులోకి తీసుకొని ఇంటరాగేషన్ పేరుతో తీగ లాగితే డొంకంతా కదలడంతో ఎస్.ఐ.కి ఏమి చేయాలో పాలుపోలేదు. తనచేత పోలీస్ స్టేషన్‌లోని కానిస్టేబుళ్ళే దొంగతనాలు చేయిస్తున్నట్లు నాగన్న చెప్పారు. రాత్రి వేళల్లో తన వద్దకు పోలీసులు డబ్బుల కోసమని వచ్చి వేధించేవారని, దొంగతనం చేసైనా డబ్బులు తెమ్మని పత్రిని చేసేవారని ఇంటరాగేషన్‌లో వెల్లడి చేశారు. అందువల్లే గత్యంతరం లేక దొంగతనాలకు పాల్పడి పోలీసులకు వాటా ఇస్తున్నట్లు నిందితుడు చెప్పేసరికి ఎస్.ఐ. ఆశ్చర్య పోయారు. తమశాఖ పరువు ఎక్కడ పోతుందోనని భయపడి ఈ కుర్ర

**ఎస్పి గారూ ఏమిటీ ఘోరం?**

ఎస్.ఐ. నాగన్నను రొటీన్‌గా రికవరీల కోసం అరెస్ట్ చేసినట్లు విలేఖరులకు చెప్పారు. ఇటీవల కాలంలో ఎప్పుడూ లేని విధంగా టౌన్‌లో 40 సైకిళ్ళు చోరీ అయ్యాయి. ఈ చోరీల వెనుక ఎవరైనా పోలీసుల హస్తం వుందా అన్న అనుమానం ప్రజల్లో వుంది. కొత్త ఎస్పి గారు ఈ విషయంలో విచారణ జరిపిస్తే మరికొన్ని విషయాలు బయటపడే అవకాశం వుంది.

### గూడూరులో అంతర్ కళాశాలల పోటీలు!

గూడూరు డి.ఆర్.డబ్ల్యు కళాశాలలో 4వతేది అంతర్ కళాశాలల మహిళా టోర్నమెంట్‌లో ఎస్.వి. యూనివర్శిటీ రెక్టార్ ఎ. సాంబశివారెడ్డి ప్రారంభించి మాట్లాడారు. విద్యార్థినులు నిద్రలేచినప్పటి నుండి ట్యూషన్ తర్వాత స్కూలు, సాయంత్రం మళ్ళీ ట్యూషన్లతో సతమతమౌతున్నారు. మానసిక, శారీరక వుత్తేజానికి కారణమైన క్రీడలను మరిచిపోయారు. క్రీడలను ఆడేవారికన్నా చూసేవారు ఎక్కువయ్యారు. దక్షిణ భారత దేశంలో ఎస్.వి. యూనివర్శిటీ విద్యార్థినులు క్రీడల్లో ముందున్నట్లు రెక్టార్ చెప్పి ముగించారు. కళాశాల కమిటీ అధ్యక్షుడు అల్లారెడ్డి శ్యాం సుందరరెడ్డి కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. విశ్వ విద్యాలయ స్పోర్ట్స్ బోర్డ్ కార్యదర్శి జయకుమార్, కళాశాల కరస్పాండెంట్ సి.ఆర్.రెడ్డి, ప్రిన్సిపాల్ మెహర్‌మణి తదితరులు ప్రసంగించారు.

గూడూరులో జరిగిన ఇంటర్ యూనివర్శిటీ టోర్నమెంట్స్ ప్రారంభిస్తున్న రెక్టార్ ఎ. సాంబశివా రెడ్డి, కళాశాల ప్రిన్సిపాల్ మెహర్‌మణి, శ్యాంసుందర రెడ్డి చిత్రంలో వున్నారు.

# మురికి టౌన్ అవార్డుకు అన్ని విధాలా అర్హత కలిగిన కావలి టౌన్!

కావలి ప్రజలు ఏ జన్మలో ఏ పాపం చేశారోగాని కంటి నిండా నిద్రకు, కడుపు నిండా నీరు త్రాగే అదృష్టానికి నోచుకోలేరు. పట్టణ జనాభా దరిదాపు లక్ష దాటుతున్నా ప్రాథమిక సౌకర్యాల కల్పనలో మునిసిపాలిటీ పూర్తిగా విఫలమయింది. మురికి పట్టణంగా జిల్లాలో అవార్డు ఇవ్వాల్సి వస్తే అది ఖచ్చితంగా కావలికే వచ్చి తీరుతుంది. పట్టణంలోని ప్రధాన వీధుల రోడ్లే అధ్వాన్నంగా వుంటాయి. సందుల గొందుల సంగతి ఇక వర్ణించలేము. మునిసిపల్ కూరగాయల మార్కెట్, చేపల మార్కెట్లు వెదజల్లే దుర్గంధానికి జాతీయ రహదారిపై వెళ్లే వారి ముక్కు పుటాలు సైతం అదిరి పోతాయి. ఏ వీధి చూసినా ఏమున్నది గర్వ కారణ మన్నట్లు పందులు స్వైర విహారం చేస్తుంటాయి. టౌన్‌లో డ్రైనేజి సౌకర్యం వున్న వీధులు తక్కువ. వాటిని నెలల తరబడి శుభ్ర పరచరు. అవి దోమల ఉత్పత్తి కేంద్రాలుగా మారి కంటి నిండా నిద్ర లేకుండా చేస్తున్నాయి. అంత పెద్ద కావలి పట్టణానికి వాటర్ ట్యాంకు లేదంటే అందరూ ఆశ్చర్య పోతారు. ఇంకా పంప్ హౌస్‌ల నుంచే డైరెక్ట్‌గా నీళ్లు సరఫరా చేస్తారు. సరఫరాకు సమయం సందర్భం వుండదు. ట్యాంకు నిండలేదనో, కరెంట్ లేదనో కుంటి సాకులు చెబుతారు. నిలువెత్తు గోతులు తవ్వుకొన్న కొళాయిల్లో వచ్చే నీళ్లు అంతంత మాత్రమే. కొన్ని ప్రాంతాలు మినహా మిగిలిన ప్రాంతాల్లో ప్రజలు సిటీ బావులపైనే, ఛారిటబుల్ ట్యాంకుల పైనే ఆధార పడవల్సిన దుస్థితి సంవత్సరాల తరబడి వుంది. ఎంతకాలం వస్తే కావలి వాసులకు నీటి తడవను నీయుండదు. ఈ సమస్యలన్నీ ఎమ్మెల్యే యానాది రెడ్డి గారికి తెలుసు. కాని మునిసిపాలిటీ వారు టౌన్ విషయం పట్టించు కోవాలంటారు. మునిసిపాలిటీ తన పెద్ద నిధులు లేవనే తారక మంత్రం వల్లిస్తుంటుంది. మరి ఎవరు దయ తలుస్తారో... కావలి సమస్యలు ఎప్పుడు తీరుతాయో దేవునికే ఎరుక!

## ఉద్యోగ ప్రకటన

నెల్లూరు జిల్లా అనుమ సముద్రం పేట గ్రామములోని శ్రీశ్రీ అల్ హజ్ సయ్యద్ నా ఖాజా రహమతుల్లా నాయబె రసూల్ వారి దర్గా యందు ''ఖురాన్'' చదువుటకు ''హఫిజ్'' ఉద్యోగమునకు దరఖాస్తులు కోరడమైనది.

1) విద్యార్హతలు : హఫిజ్ ఖురాన్ సర్టిఫికేటు గుర్తింప బడిన విద్యాలయము నుండి పొంది యుండ వలెను.

2) వయస్సు : 19 సంవత్సరముల నుండి 45 సంవత్సరముల లోపు యుండ వలెను.

3) నివాసము : నెల్లూరు, ప్రకాశము మరియు గుంటూరు జిల్లాల వాసిగా యుండవలెను. నెల్లూరు జిల్లా వాసికి ప్రాధాన్యం ఇవ్వబడును.

4) జీతము : నెలకు రూ 400/- విలువు బట్టి పెంచబడును.

దరఖాస్తు ఫారము: (1) పేరు (2) చిరునామా (3) విద్యార్హతలు (4) గత అనుభవము వివరములు.

దరఖాస్తు 27.1.1995 తేది లోగ దర్గా ట్రస్టి గార్కి పంపవలెను. ఇంటర్వ్యూలకు వచ్చు వారు తమ స్వంత ఖర్చులతో రావలయును.

సయ్యద్ అహమద్ బాషా, ట్రస్టి

A.S.Pet Mosque & Tomb Board, A.S. Pet, Nellore Dt.

# కోవూరుకు ఆర్‌టిసి బస్సులు రాకుంటే ప్రయాణీకులకు తిప్పలే!

కోవూరు నుండి ఆర్టీసి బస్సులు రాకుండా బైపాస్ రోడ్డుపై వెళుతుండడంతో పలు గ్రామాల ప్రజలు పడరాని పాట్లు పడుతున్నారు. అల్లూరు, విడవలూరు, ఇస్కపల్లి, పొటుమారు, రామతీర్థం, ఉప్పలపాడు గ్రామాలకు చెందిన వారు కోర్టుకు, ఇతర ప్రభుత్వ కార్యాలయాల పనుల నిమిత్తం వస్తుంటారు. బస్సులు టౌన్‌లోకి రాకుండా పోవడంవల్ల ఈ ప్రయాణీకులు ఒకటిన్నర కిలోమీటరు దూరంలో వున్న జనమడుగు సెంటర్‌కు నడవను ప్రయాస పడుతున్నారు. కొన్ని బస్సులైనా కోవూరు మీదుగా నడిచేలా శాసన సభ్యుడు ప్రసన్నకుమార్‌రెడ్డి చర్యలు తీసుకోవాలని ప్రజలు కోరుతున్నారు.

### కావలిలో రాజకీయ బదలీలు మొదలయ్యాయి!

ఎన్నికల్లో తమకు

## జిల్లా వార్తలు

అనుకూలంగా వ్యవహరించని అధికారుల పైన కావలిలో ఓడిపోయిన తెలుగుదేశం అభ్యర్థి -ఒంటేరు వేణుగోపాలరెడ్డి కత్తి దూసివున్న విషయం అందరికీ తెలిసిందే. ఆ వేటు మొదటగా కొండాపురం ఎస్.ఐ. బదిలీపైన, తరువాత రూరల్ ఎస్.ఐ. కృష్ణ కిషోర్‌రెడ్డి పైన పడింది. రూరల్‌కు కొత్త ఎస్.ఐ.గా నెల్లూరు క్రైంబ్యూరో ఎస్.ఐ. షేక్. గౌస్‌భాషా నియమితులయ్యారు. నెల్లూరు హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ మంత్రి ప్రసన్నను కలిసి బదలీల జాబితా లిస్టును వంటేరు సమర్పించారు. డి.ఎస్.పి., మునిసిపల్ కమీషనర్, ఆర్టీవో కూడా ఈ జాబితాలో వున్నట్లు తెలుస్తుంది. అధికారపర్గం మార్పులు చేపట్టి యానాదిరెడ్డిని గత్తర పెట్టాలని వేణు ఆలోచన. సమయం చూసి స్పందించడం యానాదిరెడ్డి శైలి. ఎవరిది పై చేయి అవుతుందో, లేక వుభయ భ్రష్టుత్వం పడతారో వేచి చూడాల్సిందే!

### భక్తులపై ఆర్టీసిదయ

కొత్త సంవత్సరం రోజున భక్తులపై రాపూరు ఆర్టీసి డిపో కనికరం చూపింది. పెంచల కోనకు అదనంగా కేవలం 4బస్సులే నడుపుతామన్న డిపో వారు ఆ నిర్ణయాన్ని ఎందువల్లో మార్చుకొన్నారు. రాపూరు, సోమశిల, నెల్లూరు, వెంకటగిరిల నుండి ఆ వేళ ప్రత్యేక సర్వీసులు నడపడంతో భక్తులు సంతోషించారు. ఆరోజు బస్సుల

(గత 8 పేజీలో)

జమీన్‌రైతు
సంవత్సరమునకు రూ. 100/-
అర్థసంవత్సరమునకు రూ. 50/-
విడిప్రతి రూ. 2/-





# సామాన్యుల కర్థమయ్యే తత్వ జ్ఞాన బోధ గ్రంథం!

సంసారమగ్నులైన మానవుని మనోవ్యాకులతను పోగొట్టేందుకు; సుఖ దుఃఖాలను సమానంగా చూసేందుకు; జీవన్ముక్తి నొనర్చేందుకు; సనాతన ధర్మ కర్మిష్టులైన మన పూర్వులు, తత్వవేత్త లెన్నెన్నో ఉద్గ్రంథాలు రచించారు. తమ పవిత్ర జీవితానుభవసరణితో సామాన్యులకు మార్గదర్శకులైనారు.

సామాన్యులకు సులభంగా అర్థమయ్యేటట్లు తత్వరహస్యాలు; ఇతిహాసాలు రచించారు. నాటిలో ముఖ్యమైనవి, వాల్మీకి రామాయణం, మహాభారతం, హరివంశం, యోగ వాశిష్ఠం.

వాల్మీకి మహాముని యోగ వాసిష్ఠాన్ని 34,000 శ్లోకాలలో రచించారు. అది తత్వశాస్త్రం.

16 సంవత్సరాల ప్రాయంలోనే శ్రీరామ చంద్రునకు, ప్రపంచము దుఃఖాలయంగాను, జీవితమనిత్యంగాను గోచరించాయి. అతనని విచారగ్రస్తునిగా చేశాయి. అతని గురువైన వశిష్ఠ మహాముని శ్రీరాముని విచారము పోగొట్టుటకు ప్రపంచపు వాస్తవ స్వరూపాన్ని వివరించాడు. మానవుడే విధంగా జీవన్ముక్తుడు కాగలడో వివరిస్తాడు. శ్రీరామ వశిష్ఠుల ప్రశ్నోత్తరములే యోగ వాశిష్ఠం.

ఈ గ్రంథంలో వైరాగ్య, ముముక్షు వ్యవహార ఉత్పత్తి ప్రకరణాలున్నాయి. ఇది సామాన్యులకు సులభ గ్రాహ్యంగా సరళమైన శైలితో వచనంగా శ్రీ వశిష్ఠ రామ సంవాదమను పేరుతో శ్రీ వై. హెచ్. రామకృష్ణగారు గ్రంథాన్ని రచించారు. వీరు తొలి సంపుటములో వైరాగ్య ముముక్షు వ్యవహార ప్రకరణములు రచించి, మలి సంపుటములో ఉత్పత్తి ప్రకరణ ప్రథమార్థము రచించారు.

శిష్యుల, కృపణత్వమనగా మనోదీనత్వమును లేక వైకల్యమును గురువులు సంస్కరించుటలో యోగ వాశిష్ఠంనకు, భగవద్గీతకు సారూప్యాలు వున్నాయి.

ఈ గ్రంథము మహావాక్య వివరణతో ప్రారంభించ బడినది. ప్రతి జీవి లక్ష్యము నిత్యముక్తి పూర్ణ స్వరూపముతో భాసించడమేనని వివరింపబడినది. బృహదారణ్యములో 'శ్లో. యోవా ఏత దక్షరం గార్గ్య విదిత్వా లోకాత్ ప్రైతి సకృపణః' అక్షర తత్వ మెఱుగక మరణించువారు కృపణుడని నిర్వచింప బడినది.

కనుక మానవుడు పరమార్థం తెలిసికొనుట జన్మ...ల్యం కోరతెనని చెప్పవచ్చు.

ఈ ఉత్పత్తి ప్రకరణార్థంలో రెండు కథలున్నాయి. ఒకటి ఆకాశజాడు- మృత్యువు. రెండవది లీలోపాఖ్యానము. ఈ కథలు ప్రపంచ పుట స్థిరత్వము, వాసనలు, వాసనాక్షయ మొనర్చుకొని జీవన్ముక్తిని పొందుట వివరిస్తాయి.

## ఆకాశజాడు - మృత్యువు

ఆకాశజాడనే తత్వవేత్తను మృత్యువు సమీపించ లేక పోతుంది. దానికి కారణం మృత్యువు యముడ్ని అడుగుతుంది. యముడు మృత్యువుతో నంటాడు ''నీవెవరినీ చంపలేవు. ఆయా వ్యక్తుల కర్మలే వారికి మరణ కారణములు. ఆకాశజాడు జన్మకర్మ రహితుడు. స్వయంభువు. పంచభౌతిక శరీర రహితుడు. ఆకాశమువలె నిర్మలుడు - కనుక మృత్యురహితుడు. అతడు బ్రహ్మము తెలుసుకొన్నవాడు. ''బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవభూతి'' బ్రహ్మము నెఱిగిన వారు బ్రహ్మయే అవుతారు. ఈ విధంగా మృత్యువునకతీతుడైన ఆకాశజుని గురించి చెప్పబడింది.

వశిష్ఠుడు జీవన్ముక్తుని గురించి వివరిస్తాడు. '' నేను మనో సంకల్ప మాత్రుడను. దేనికి కర్తనుగాను, చైతన్య స్వరూపడను'' అని తలచి దృశ్య జగత్తు శూన్యమని తలచువాడు జీవన్ముక్తుడని వివరించ బడింది.

> గ్రంథసమీక్ష
> శ్రీ వశిష్ఠరామ సంవాదము
> రచయిత
> వై.హెచ్.రామకృష్ణ
> సమీక్షకులు
> దుగ్గొట్టి వేంకటరమణయ్య
> ప్రతులకు
> వై. కనకదుర్గ
> 16/255 వృత్తమ్మటూర్పు వీధి గాంధీనగర్ - నెల్లూరు-1
> వెల : రు. 45/-

వశిష్ఠ మహాముని సుదీర్ఘమైన లీలోపాఖ్యానము ద్వారా అసత్యమైన జగత్తు సత్యము వలె ఏవిధంగా భాసిస్తుందో వివరిస్తాడు. ఈ కథ 217 పేజీలకు పరిమితము. కథాంతమున సమీక్ష కూడా యివ్వబడింది.

## లీలోపాఖ్యానం

ఈ ఉపాఖ్యానంలో మనుజుని భావనలోనే కాలగమనం అని వ్యాఖ్యానించబడింది. లీలావతి భర్త పద్ముడను రాజు మరణించి, విధూరధుడై జన్మించి 70 సంవత్సరములు రాజ్యమేలి యుద్ధమున మరణించి మరల పద్ముని శరీరములో ప్రవేశిస్తాడు. పద్ముడు మరణించి మరల జీవించిన మధ్యకాలము 8 రోజులు. విధూరధుని జీవితకాలము 70 సంవత్సరాలు. ఒకచోట 70 సంవత్సరాలు యింకొక చోట 8రోజులెలా అవుతాయి? కాల గమనానికి వేర్వేరు ప్రమాణము లుండునా? అన్న శ్రీరాముని ప్రశ్నకు వశిష్ఠుని సమాధానము మానవుని భావనే అంటాడు. మానవుడు ఒక క్షణపు దుఃఖమును కొన్ని యేండ్లుగా, ఒక సంవత్సర సుఖమును క్షణముగా అనుభవించు చున్నారు గదా అని కాలగతి సంకల్ప మాత్రమనియు స్వప్నములో కొన్నియేండ్లు గడచినట్లనుభవిస్తున్నాము గదా అని సమాధానము. అది విచారణీయము.

ఈ గ్రంథము తత్వజ్ఞానాభిలాషులు చదువదగినది. ప్రతివ్యక్తి నిత్యము దైవ సంబంధమైన స్మృతిని కలిగి యుండాలని, తత్వ జ్ఞానమును ప్రత్యక్షముగా దర్శించి, అనుభవించ వలెనని శ్రీకృష్ణుని ఉపదేశము (అ13శ్లో12) ఈ గ్రంథమీ అభిప్రాయమును బలపరచుచున్నది. ఈ గ్రంథమున రేఖా చిత్రముల ద్వారా సులభ గ్రాహ్యముగు రీతిని వివరణ లివ్వబడినవి.

యోగ వాశిష్ఠ గ్రంథమును గురించి స్వామి రామతీర్థ అభిప్రాయము.

'' One of the greatest looks, the most wonderful, according to me ever written under the sun , is yoga vasistha which no body on earth can read without attaining God-Conscious ness, nobody can read through without becoming one with all''

## జిల్లా వార్తలు

7వ పేజీ కొరవ)

కలెక్షన్ 40వేలు వచ్చిందని డిపో మేనేజర్ ఎ. సుధాకర్ తెలిపారు.

### కనుపర్తిపాడులో క్రికెట్ పోటీలు!

కనుపర్తిపాడు యూత్ అసోసియేషన్ ఆధ్వర్యంలో జిల్లా స్థాయిలో క్రికెట్ టోర్నమెంట్ 9తేది నుంచి కనుపర్తిపాడులో జరుగనుంది. విజేతగా నిలిచిన జట్టుకు 2,500, రన్నర్స్‌కు 1116లు ప్రైజ్‌మనీగా ఇస్తారు. బెస్ట్ బ్యాట్స్‌మెన్, ఆల్ రౌండర్, బౌలర్, వికెట్ కీపర్ ప్రత్యేక బహుమతులు ఇవ్వనున్నారు. మిగతా వివరాలకు బి.వి.రమణారెడ్డి, అడ్వకేట్, కిరాఫ్ గుంటూరు హౌస్, పొగతోట, నెల్లూరు -1 అడిగి తెలుసుకోవచ్చు.

### స్పిక్ ఇండియా వైద్య శిబిరం

రాపూరు మండలం పంగిలి గ్రామంలో 30 తేది స్పిక్ ఇండియా స్వచ్ఛంద సేవాసంస్థ ఆధ్వర్యంలో చిన్న పిల్లలకు వుచిత వైద్య శిబిరం జరిగింది. ప్రభుత్వ డాక్టర్ షేక్ గౌసియా బేగం 150 మంది పిల్లలను పరీక్షించి వుచితంగా మందులు పంచి పెట్టారు. ఈ సందర్భంగా స్పిక్ ఇండియా ఎ.డి. షామీర్ మాట్లాడుతూ తమ సంస్థ రాపూరు, డక్కిలి మండలాల్లోని 25 గ్రామాల్లో పని చేస్తున్నట్లు చెప్పారు. రాపూరు మండలంలోని పంగిలి, తెగచెర్ల గ్రామాల్లో హెల్త్ సెంటర్లు ఏర్పాటుకు కృషి చేస్తున్నట్లు వివరించారు.

### కొత్త సంవత్సరం రోజున పెంచల కోనలో దోపిడీ!

కొత్త సంవత్సరం ప్రారంభాన దేవుడ్ని దర్శిస్తే అంతా మంచి జరుగుతుందని ప్రతి ఒక్కరూ ఆరోజున దేవాలయాలకు పరిగెడతారు. భక్తులను దోచుకొనేందుకు అంతకన్నా మంచి ఛాన్సు రాదేమోనని పెంచలకోనకు వచ్చిన భక్తులను ఆలయ సిబ్బంది అడుగడుగునా ఆరోజు దోపిడీ చేసి వదిలారు. నరసింహస్వామి దర్శనార్థం కడప, చిత్తూరు, నెల్లూరు జిల్లాలనుండి వేల సంఖ్యలో భక్తులు తరలివచ్చారు. వారికోసం కనీస సౌకర్యాలు కల్పించడంలో విఫలమైన ఆలయ సిబ్బంది ఇష్టారాజ్యంగా ప్రవర్తించారు. దేవుని దర్శనానికి రెండు, ఆరు రూపాయల 'క్యూ'లు ఏర్పాటు చేశారు. 6 రూపాయల టిక్కెట్ కొన్నవారిని, తమ చేతిలో ధనమో, పణమో పెట్టిన వారిని తప్ప రెండు రూపాయల టిక్కెట్ కొన్నవారిని గంటల తరబడి క్యూ నుండి కదలనీయలేదు. కొందరు భక్తులు తిరగ బడడంతో కొంతమందిని మాత్రం అనుమతించి దేవునికి చేతులెత్తి నమస్కరించక ముందే వారిని త్రోసి వేయడం జరిగింది. హారతి పళ్లెంలో డబ్బులు వేయకుంటే నెత్తిన శఠగోపురం. చేతిలో తీర్థం పడలేదు. ఆలయం వెలుపలకు భక్తుల వస్తున్న సమయంలో దీపారాధన హుండీ వద్ద ఖచ్చితంగా డబ్బులు వేయాలని సిబ్బంది దబాయిస్తుండినారు. వి.ఐ.పి.ల దర్శన ద్వారం గుండా సిబ్బంది చేతిలో పదో, పాతిక ఇచ్చిన వారిని పంపి బాగా సొమ్ము చేసుకొన్నారు. ఆర్టీసి బస్సులు తప్ప మిగతా వాహనాల నుండి కూడా పార్కింగ్ ఫీజు వసూలు చేశారేగాని రసీదు ఇచ్చిన పాపాన పోలేదు. దేవుని దర్శనానికి వెళ్లిన సాధారణ భక్తులు మొత్తానికి కొత్త సంవత్సర ఆరంభానే పడరాని పాట్లు పడ్డారు. నరసింహస్వామి చూస్తూ ఊరుకోవడం వల్లే ఇవన్నీ జరుగుతున్నాయి. ఆయన ఒకసారి ఘీంకరిస్తే, గాని దారికిరారు సిబ్బంది!

## పంచాంగం

12 తేది గురువారం ముక్కోటి ఏకాదశి

### జనవరి తిథులు

పుష్యశుద్ధ

| | | | |
|---|---|---|---|
| తే 7 | శని షష్ఠి | ఉ.గ. | 10.51 వ |
| తే 8 | ఆది సప్తమి | ప.గ. | 11.28 వ |
| తే 9 | సోమ అష్టమి | ప.గ. | 12.38 వ |
| తే 10 | మంగళ నవమి | ప.గ. | 2.14 వ |
| తే 11 | బుధ దశమి | ప.గ. | 4.10 వ |
| తే 12 | గురు ఏకాదశి | ప.గ. | 6.20 వ |
| తే 13 | శుక్ర ద్వాదశి | ప.గ. | 8.30 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు

అన్నమూరెరు - ఆకవారెరు చిత్రంలో
శోభన్‌బాబు, కోడిరామకృష్ణ, బాబుమోహన్

# సెన్సార్ బోర్డులో 14 మంది స్త్రీలు

సెన్సార్ బోర్డు, దాని సలహా సంఘ కమిటీలలో మహిళలకు అర్ధ భాగం ప్రాతినిధ్యం కల్పించడం కోసం ...రాబాద్ సంఘంలో 35 మంది ...ల్లో 14 మంది మహిళలను ...చారు. ఇటీవల సవరించ ...సినిమాటోగ్రఫీ నిబంధనలకు

## ...క్స్, హింసల పై ...ప్పుడాల కత్తెరలు ...ఝుళిపిస్తారా?

అనుగుణంగా ఈ నియామకాలు జరిగినట్లు ప్రచార శాఖ - చలన చిత్ర విభాగం సంయుక్త కార్యదర్శి ఎస్.గోఖలే తెలిపారు. ద్వంద్వార్థాలు, ... మీరిన హింస, సెక్స్‌ను ...డ్డానికి మహిళలు ఎంత ...షి చేస్తారో వేచి చూద్దాం.

## ఎ.ఎం.రత్నం సంకల్పం

బుచ్చిరెడ్డి పాళెం వాస్తవ్యుడు ఎ.ఎం. రత్నం పట్టిందల్లా బంగారమవుతుంది. కర్తవ్యం, ఆయనే స్వయంగా దర్శకత్వం వహించిన పెద్దరికం, డబ్బింగ్ చేసిన జెంటిల్‌మెన్, ప్రేమికుడు ఒకదానిని మించి మరొకటి హిట్లయ్యి టాప్‌టెన్‌లో నిలబెట్టాయి. ప్రస్తుతం యువతరం ఎదుర్కొంటున్న సాంఘిక సమస్యను ఇతివృత్తంగా తీసుకొని ఫ్యామిలీ డ్రామాను మిళితం చేసి 'సంకల్పం' చిత్రం తీస్తున్నట్లు చెప్పారు. జగపతి బాబు, గౌతమి హీరో హీరోయిన్లు. జయసుధ ఒక ప్రత్యేక పాత్ర పోషిస్తున్నారు. చంద్రమోహన్, సుధాకర్, బ్రహ్మానందం, రాళ్లపల్లి, విలన్‌గా ప్రకాష్‌రాజ్ అనే నూతన నటుణ్ని పరిచయం చేస్తున్నారు. రచన పరుచూరి బ్రదర్స్ చేస్తున్నారు.

దాసరి పెద్ద ఆశ పెట్టుకొంటున్నాడు!

# లవకుశను మించే మాయాబజార్ మాయ!

పేరుకు తగ్గట్టే దర్శకుడు దాసరి నారాయణ రావు నిర్మిస్తున్న సోషియో ఫాంటసీలో పలు ప్రత్యేకతలు ప్రేక్షకులను ఆకర్షించి తీరుతాయంటున్నారు. పాత మాయబజార్ చిత్రంలో ఘట్టయ్య దొర అనే కోయ దొర పాత్రను దాసరి పోషిస్తున్నారు.

ఈ పాత్ర ఘటోత్కచుడు గెటప్‌ను దృష్టిలో పెట్టుకొని సృష్టించడం జరిగిందని చెప్పారు. అక్కినేని నాగేశ్వర రావు అభినవ కృష్ణునిగా నటిస్తుండగా ఆయనచేత డైలాగులను కొత్త రకంగా చెప్పిస్తున్నారు. నాగేశ్వర రావు గారితో కథా నాయికగా నటించాలని ప్రతి హీరోయిన్ కోరుకుంటుంది. అందుకే ఆయన సరసన నటించని మేటి కథా నాయికలతో ఒక పాట సృష్టిస్తున్నట్లు దాసరి వివరించారు. అదేగాక మోహన్‌బాబుతో వెరైటీ సిచ్యుయేషన్ సాంగ్‌ను మాస్ అట్రాక్షన్ కోసం పెడుతున్నారు. సుమన్, ఆమని హీరో, హీరోయిన్లు. తెరపై మరుగై పోయిన ప్రభ, డ్యాన్సర్ అనురాధ మళ్లీ ఈ చిత్రంలో కన్పిస్తారు. లవకుశ సినిమా అంత విజయం సాధించి తీరుతుందని దాసరి నారాయణ ధీమాగా చెబుతున్నారు. మరి చిత్రం విడుదలైతే గాని ఆ విషయం తెలియదు. మాటలు తోటపల్లి మధు, సంగీతం మాధవపెద్ది సురేష్, ఎస్.వి. కృష్ణారెడ్డి తీస్తున్న ఘటోత్కచుడు కూడా శరవేగంతో తయారవుతున్నది. ఎవరి చిత్రం ప్రేక్షకులను సమ్మోహితులను చేస్తుందో మరి!

## గండం నుంచి బయటపడ్డ పండరీబాయి

చాలామంది హీరోలకు తల్లిగా నటించిన పండరీబాయి ఇటీవల మద్రాసు నుంచి బెంగుళూరుకు

ప్రైవేటు బస్సులో బయల్దేరి వెళ్తా వాణియంపాడి అనేచోట టీ కోసం బస్సు ఆగగా, ఆమె కూడా బస్సు దిగింది. అప్పుడు ఉదయం మూడు గంటలవుతుంది. ఆ సమయంలో వాహనాల రద్దీ లేదు గనుక ఆమె రోడ్డు మీద నిలుచుంది. ఇంతలో వేలూరు నుండి రివ్వున వచ్చిన లారీ ఆమెను ఢీకొంది. డ్రైవర్ బ్రేక్ వేసేసరికి ఆమె ఎడమచేతి మీద వెనుక చక్రం నిలిచింది. గాభరాగా డ్రైవర్ పారిపోయాడు. బస్సు డ్రయివర్ ఆ లారీని అతి కష్టం మీద ఆమె ఎడమ చేతిమీద నుంచి తొలగించాడు. ఎకాయెకిన ఆమెను వేలూరు తీసుకెళ్లి సి.ఎం.సి. ఆస్పత్రిలో చేర్పించారు. నుజ్జునుజ్జయిన ఆమె ఎడమ చేతిని డాక్టర్లు తొలగించ వలసిన అవసరం ఏర్పడింది. ఎడమకాలు, ముఖం, గొంతుకు కుట్లు వేశారు. కర్ణాటక రాష్ట్ర మంత్రి లలితా నాయక్ వేలూరుకు వచ్చి, వైద్య ఖర్చుల నిమిత్తం కర్ణాటక ప్రభుత్వం తరఫున పాతిక వేలు ఇచ్చారు. తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత కూడా ఆమె పరిస్థితి గురించి ఎప్పటి కప్పుడు తెలుసు కుంటున్నారు.

## ఆంగ్ల చిత్రంలో హేమమాలిని

"గాంధీ చిత్రాన్ని రూపొందించి, ఖ్యాతి గాంచిన రిచర్డ్ ఆటన్‌బరో త్వరలో ప్రారంభించే "రాణి లక్ష్మిబాయ్ ఆఫ్ ఝాన్సి" ఆంగ్ల చిత్రంలో హేమమాలిని నాయిక.

## 43 చిత్రాల్లో బ్రహ్మానందం

94 లో విడుదలైన 43 చిత్రాల్లో నటించి హాస్యనటుడు బ్రహ్మానందం ఒక రికార్డు స్థాపించాడు.

# సూర్యకాంతం శవయాత్రకు సినిమా వారెవ్వరూ రాలేదు!

దివంగత నటి సూర్యకాంతం భౌతికకాయన్ని తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత సందర్శించి వెళ్లిన అనంతరం వాణిశ్రీ, జి. వరలక్ష్మి, అల్లు రామ లింగయ్య,

అంజలీ దేవి, గీతాంజలి, రాధాకుమారి, నిర్మాత పోకూరి బాబూరావులు - కూడా వెళ్ళి శ్రద్ధాంజలి ఘటించారు. ఆమె అంత్య క్రియలకు పట్టుమని పదిమంది కూడా హాజరవ లేదు. వారిలో సినీ ప్రముఖుడు ముళ్లపూడి వెంకట రమణ ఒక్కడే. సూర్యకాంతం అందరితో కలిసి పోయేది. ఎవరింట్లో ఏ శుభ కార్యం జరిగినా తాను ముందు ఉండేది. చివరికి ఆమెకు వీడ్కోలు చెప్పడానికి ఆమె వల్ల ఉపకారం పొందినవారు కూడా

**సినీ తారలకు చివరకు మిగిలేదిదేనా?**

హాజరవక పోవడం ఎంతో శోచనీయమైన విషయం.

## హీరోగా మరో నిర్మాత కుమారుడు

విజయ మాధవి సంస్థ అధినేత వడ్డే రమేష్ తన కొడుకు నవీన్‌ను సినిమా హీరో చేయాలని ప్రయత్నిస్తున్నారు.

# ...దేవికి బ్యాడ్‌లక్ ఇయర్!

...స్టార్ శ్రీదేవికి ...ఏమంత బాగోలేదు.

...ఆమె నటించిన లాడ్లా తప్ప ...చిత్రాలన్నీ అడ్రస్ లేకుండా ...యి. తెలుగులో నటించిన ...విందా. గోవిందా, ఎస్.పి. పరశురాం ...డి బాటలో నడిచాయి. కాని శ్రీదేవిలో కళాతృష్ణ తీరడం లేదు. బిజీ అవడానికి విఫల యత్నం చేస్తూంది. కొత్త తారల ధాటికి శ్రీదేవి తట్టుకోలేక పోతున్నది. మంచి ఫామ్‌లో వున్నప్పుడే రిటైర్ అయ్యి మంచి వరుణ్ని వెతుక్కోవడం శ్రీదేవికి అన్ని విధాలా శ్రేయస్కరమేమో!

## సావిత్రి ఫొటో ఎగ్జిబిషన్

హైదరాబాద్‌లోని కళాభవన్‌లో వీడియోకాన్, తిరుమల మ్యూజిక్ సెంటర్ వారు మహానటి సావిత్రి 13 వ వర్ధంతి సందర్భంగా ఫోటో ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశారు. ఆమె నటించిన చిత్రాలలోని, నిజ జీవితంలోని కొన్ని తీపి గుర్తులకు సంబంధించిన స్టిల్స్ పలువుర్ని ఆకర్షించాయి. సావిత్రి కుమార్తె విజయ చాముండేశ్వరి, నటి వాణిశ్రీ, సి.నారాయణ రెడ్డి కార్యక్రమంలో పాల్గొన్నారు. 'పెళ్లయిన వాడ్ని పెళ్లి చేసుకోకు. ప్రతి సంవత్సరం నీ

**కొత్త తారల ధాటికి తట్టుకోలేక తపన పడుతూంది; తెర నుంచి తప్పుకోను ఇదే మంచి సమయం కాదా?**

ఆదాయం లెక్కలు, ఇన్‌కంటాక్స్ లెక్కలు క్రమం తప్పకుండా సరి చూసుకొంటూ వుండు' అని సావిత్రి గారిచ్చిన సలహాలను తాను ఎన్నడూ మరవలేదని వాణిశ్రీ ఈ సందర్భంగా చెప్పారు.

## మరో సోషియో ఫాంటసీ చిత్రం

యమలీల హిట్ అనంతరం తెలుగులో సోషియో ఫాంటసీలు ఎక్కువయ్యాయి. రాఘవేంద్ర రావు కూడా ఇదే తరహాకు శ్రీకారం చుట్టారు. వెంకటేష్, బాజీగర్ ఫేమ్ శిల్పాశెట్టి, మాలాశ్రీతో సాహస వీరుడు - సాగర కన్య షూటింగ్ తెలుగు మంత్రులు బసిరుద్దీన్ బాబుఖాన్, చిక్కాల రామచంద్ర రావు చేతుల మీదుగా ప్రారంభ మయ్యింది. ట్రిక్ ఫొటోగ్రఫీ వుంటుంది కాబట్టి అజయ్ విన్సెంట్‌ను కెమెరామెన్‌గా ఎన్నుకున్నారు. సితారత్నం గారి అబ్బాయి, ఏమండోయ్ ఆవిడ వచ్చింది, చిత్రాల నిర్మాత శివరామ కృష్ణ ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు. రాఘవేంద్ర రావు తీసిన జగదేక వీరుడు- అతిలోక సుందరి నెనే పనటి హిట్ అయింది. మరి దీని మాటేమిటో?

# కుట్ర జరుగుతుందని ముద్దుగోల- అంతా అడ్వొకేట్ జనరల్ లీల!

అడ్వకేట్ జనరల్ శ్రీ రామచంద్ర రావు గారు ఒక్కరే ఆ సమయంలో ఆయన వ్యక్తిగా వున్నారు. అంతకు క్రితం ముఖ్య మంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు విద్యుత్ కేంద్రం యజమానులతో నగరంలోని ఒక ఫైవ్ స్టార్ హోటల్‌లో సుదీర్ఘ సమావేశం జరిపారని వదంతి. ఆ సమావేశం తీర్మానానికి అనుగుణంగానే ఆయన రామచంద్ర రావు ద్వారా ఎన్‌టిఆర్ చేత ఆ ప్రకటన చేయించారని చెప్తున్నారు.

ఈ రద్దు ప్రకటన న్యాయ పరంగా ఆలోచిస్తె ప్రభుత్వ వుద్దేశానికి పూర్తి వ్యతిరేకంగా వుంది. ప్రకటన తోపాటు రామచంద్ర రావు గారు అప్పటి కప్పుడు ఒక షోకాజ్ నోటీసు కూడా తయారు చేయించారట. దాన్ని విద్యుత్ కేంద్రం యజమానులకు అందజేసి వుంటే, వారికి కోర్టులో ఆ కేంద్రం యధాతథంగా చేజిక్కి వుండేదని, ఆ నోటీసు అంతన్యాయ విరుద్ధంగా వుందిందని చెప్తున్నారు.

అయితే ఈ దశలో విద్యుత్, న్యాయశాఖ అధికార్లు జోక్యం చేసుకొని ఎన్‌టిఆర్‌కు జరగనున్న ప్రమాదం గురించి హెచ్చరించడంతో ఆయన నాలుక కరుచుకొని తన ప్రకటనను వుప సంహరించు కున్నారు. విద్యుత్ కేంద్రాల సాధ్యాసాధ్యాలు, ఆర్థిక స్థితిగతులపై అధ్యయనం చేయడానికి ఒక పరిశీలనా సంఘం నియమించారు. ఈ సంఘం ఇచ్చే నివేదిక ఆధారంగా కృష్ణపట్నంపై తదుపరి నిర్ణయం తీసుకోవడం జరుగుతుందని ప్రభుత్వం ప్రకటించింది.

అసలు త్రిక్కి, కాళ్లు కడిగిన- ఈ తొందరపాటుకు కారణమేమిటి? దీని వెనక పెద్ద కుట్ర వుందని, థర్మల్ కేంద్రాన్ని యధాతథంగా అంగీకరింప జేయడానికి కోర్టుల సహకారం పరోక్షంగా లభింప జేసేందుకు చంద్రబాబు నాయుడు ఈ పథకం రచించారని మంత్రి శ్రీ గాలి ముద్దుకృష్ణమ నాయుడు గోల చేస్తున్నారు. ఆయన బాధ ఆయనది. విద్యుత్ కేంద్రం రద్దు కోరుతూ హైకోర్టులో తాను కేసు దాఖలు చేసినందువల్ల ఎన్నికలలో తనను ఓడించడానికి ఆ యజమానులు లక్షల కోట్ల డబ్బును తన ప్రత్యర్థికి అందించారని; పెద్ద పెద్ద పారిశ్రామిక వేత్తలు తనను శత్రువుగా చూస్తున్నారని; పార్టీ కోసం తాను అందరితో తగువు కొని తెచ్చుకుంటె తన పార్టీ నాయకులే వారితో చేతులు కలుపు తున్నారని ముద్దు కృష్ణమ నాయుడు ఆవేదన చెందుతున్నారు.

చాలావరకు తీరుతుంది. దాన్ని రద్దుచేసి, ప్రత్యామ్నాయంగా మరొక ప్రాజెక్టును మంజూరు చేయడానికి కనీసం ఏడారే సమయం కావాలి. రాష్ట్రంలో ఇప్పుడుండే పరిస్థితులలో ఈ ఆలస్యం చాలా ప్రమాదకర మైనది. ముఖ్యమంత్రి శ్రీ ఎన్‌టి రామారావు ఈ విషయం గుర్తించి, అనవసరపు రాజకీయ కక్షలకు పోకుండా కృష్ణపట్నం కేంద్రానికి మంజూరు కొనసాగించడం మంచిదని; ఒకవేళ ఆయన పట్టుబట్టి రద్దు చేసినా కోర్టులో వారికి అనుకూలం కావడం ఖాయమని అధికారులు భావిస్తున్నారు. పరిశీలనా సంఘం ఏమి చెప్తుందో వేచి చూడాలి.

## కృష్ణాపట్నం

(మొదటి పేజీ కొరవ)

మరొక మంత్రి శ్రీ కోటగిరి విద్యాధర రావు కూడా ఈ రద్దు ప్రకటన ప్రహసనాన్ని వ్యతిరేకిస్తున్నారు.

విజయ భాస్కర రెడ్డి హయాంలోనే, సంబంధిత యజమానుల ద్వారా చంద్రబాబు నాయుడికి వాటా ముట్టిందని వీరి ఆరోపణ. అందువల్లే ఆయన ఇప్పుడు దాన్ని నిలబెట్టడానికి అంత ఆరాటపడు తున్నారని వీరు సణుగుతున్నారు. కాని ఆ విషయం ధైర్యంగా బయటకు చెప్పే ధైర్యం వారికి లేదు.

అయితే రాజకీయ కారణాలతో, రాష్ట్రంలో విద్యుత్ కొరతను చాలావరకు నివారించ గల పెద్ద ప్రాజెక్టును రద్దు చేయ బోవడం ఆత్మహత్యా సదృశమని విద్యుత్ శాఖాధికారుల భావన. కృష్ణాపట్నం ప్రాజెక్ట్ పని వెంటనే మొదలైతే కనీసం 1998 నాటికైనా విద్యుత్ కొరత



## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

దేశంలో ప్రతి నాలుగు నిమిషాలకో అభాగ్య ఆడపడుచు అత్తింటి ఆరళ్లు భరించలేకనో, భర్త సూటి, పోటి మాటలకు తలెత్తి నిలువలేకనో తలవాల్చేస్తుంటుందని అంచనా. అటువంటి సంఘటన కొత్త వత్సర ప్రారంభ సమయాన హరనాథ పురంలో జరిగి గతానికి, వర్తమానానికి తేడా లేదని చాటింది. హరనాథపురంలోని మూడవ వీధిలో కాపురముంటున్న శ్రీనివాస రాజుకు, చిత్తూరు జిల్లా మొటకంపల్లి గ్రామానికి చెందిన వనజమ్మకు ఏడేళ్ల క్రితం వివాహమయ్యింది. బేల్దారి మేస్త్రిగా పనిచేసే రాజా తన భార్యను ప్రతిరోజా ఏదో ఒక మిషతో వేధించి హింసించేవాడు. ఎన్నో సార్లు ఆ బాధలు భరించలేక పుట్టింటికి వెళ్లడం అమె తల్లి తండ్రులు ఏదో విధంగా నచ్చ చెప్పి పంపడం జరుగు తుండేది. ఇద్దరు పిల్లలు పుట్టిన తరువాత కూడా రాజా తన ప్రవర్తనలో మార్పు తెచ్చుకోలేదు. శనివారం రాత్రి వనజమ్మ బిడ్డలతో పడుకొని వుండగా వచ్చి ఘర్షణకు దిగాడు. గడియ బిగించి కర్రతో అమె తల పై కొట్టగా క్రింద పడిపోయింది. రక్తపుమడుగులో వున్న తల్లిని చూసిన పిల్లలు పెట్టిన కేకలకు పక్కింటి వాళ్లు వచ్చి ప్రభుత్వాసుపత్రికి చేర్చేసరికే అమె ప్రాణాలు విడిచింది. నాలుగో టౌన్ పోలీసులు కేసు దర్యాప్తుకు, డాక్టర్లు పోస్టుమార్టమ్‌కు కొత్త సంవత్సరం రోజునా అంటూ వూసురుమని కదిలారు. భార్య పై అనుమానంతో రాజా ఈ ఘాతకానికి పాల్పడినట్లు పోలీసులు చెప్పారు. ఏది ఏమైనా క్రొత్త సంవత్సరంలోనే స్త్రీ హత్యల చిట్టా పుస్తకంలోని మొదటి అధ్యాయం ప్రారంభమై పోయింది.

### జర్నలిస్ట్‌ల ఎన్నికలు

ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్ జిల్లా శాఖ ఎన్నికలు జనవరి 29 తేదీ కస్తూర్బా కళాక్షేత్రంలో జరుగుతాయి. సభ్యులు తమ సభ్యత్వ రుసుమును జనవరి 10 వ తేదీ లోగా ప్రెస్ క్లబ్‌లోని యూనియన్ కోశాధికారి వద్ద చెల్లించి రసీదులు పొందాలట. సభ్యులకు యూనియన్ తరఫున ఇచ్చే గుర్తింపు కార్డులకు అదనంగా మరో పది రూపాయలు చెల్లించాలని యూనియన్ కార్యదర్శి కె.టి. రామ్మోహన్ తెలియ జేస్తున్నారు.




నెల్లూరు జిల్లా సమగ్ర చరిత్ర గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ఎస్.ఎస్.కృష్ణమూర్తి, ప్రతిని స్వీకరిస్తున్న ప్రొఫెసర్ ఎన్.బాలకృష్ణారెడ్డి, ఎం. పట్టాభిరెడ్డి, జి.రాజారెడ్డి, జి. జవహర్‌లాల్, జి. వెంకటేశ్వరరావు, చిత్రంలో వున్నారు.

### నిరుద్యోగ ఉపాధ్యాయుల ధర్నా!

రాష్ట్ర వ్యాప్తంగా ఖాళీగా వున్న 30 వేల ఉపాధ్యాయ పోస్టులు భర్తీ చేయాలని కోరుతూ జిల్లా నిరుద్యోగ ఉపాధ్యాయ ఐక్య కార్యాచరణ సమితి 2 తేదీ కలెక్టరేట్ ఎదుట ధర్నా నిర్వహించింది. సమితి అధ్యక్షుడు డి.వి. సుబ్బరాజా కలెక్టర్‌కు వినతి పత్రం సమర్పిస్తూ పోస్టుల నియామకాల కోసం వ్రాత, మౌలిక పరీక్షలు నిర్వహించి ఇంత వరకు ఫలితాలు ప్రకటించ లేదన్నారు. తాను ఈ విషయాన్ని ప్రభుత్వం దృష్టికి తీసుక వెళతానని కలెక్టర్ సతీష్‌చంద్ర చెప్పారు. ఎస్.ఎఫ్.ఐ. జిల్లా కమిటీ ఉపాధ్యక్షుడు బి. కృష్ణయ్య, పిసిసి సభ్యుడు కె. శ్రీధర్ రెడ్డి నిరుద్యోగ వుపాధ్యాయులకు మద్దతు ప్రకటించి ధర్నాలో పాల్గొన్నారు.

### జిల్లా చరిత్ర గ్రంథావిష్కరణ

మల్లంపల్లి చరిత్ర అధ్యయన కేంద్రం ప్రచురించిన 'కాంప్రహెన్సివ్ హిస్టరీ ఆఫ్ నెల్లూరు డిస్ట్రిక్ట్' గ్రంథావిష్కరణ సభ 30 తేదీ రోటరీ ఆడిటోరియంలో జరిగింది. అధ్యయనం కేంద్రం ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ జి. వెంకటేశ్వర రావు స్వాగతం పలికి అతిథులను పరిచయం చేసారు. వున్నత విద్య కౌన్సిల్ ఛైర్మన్ ప్రొఫెసర్ ఎన్. బాలకృష్ణా రెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. గ్రంథంలో కొత్త కోణంలో జిల్లాకు సంబంధించిన చరిత్రను వెలుగులోకి తెచ్చినట్లు చెప్పారు. తనకున్న [illegible] అనుభవంతో జిల్లా [illegible] పరిస్థితులను, పెన్నానది ప్రాముఖ్యాన్ని వివరించారు. జిల్లాలో గతంలో ఎంతో ప్రాముఖ్యత సంతరించుకొన్న అల్లూరు, వెంకటగిరి ఆశించినంత అభివృద్ధి సాధించలేదు. ఇటీవల కాలంలో వెంకటగిరి ప్రాంతం కొంత మెరుగైనా, అల్లూరు తన ప్రాశస్త్యం కోల్పోయి దిగజారి వుందన్నారు. అధ్యయన కేంద్రం ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ జి. వెంకటేశ్వర రావు మాట్లాడుతూ 1870లో అనాటి జిల్లా కలెక్టర్ బాస్వెల్ నెల్లూరు మాన్యువల్ ప్రచురించారు. తరువాత జిల్లా సమగ్ర చరిత్ర రచన జరగ లేదని, అందువల్ల పరిశోధ నాత్మకంగా ఈ జిల్లా సమగ్ర చరిత్ర గ్రంథం రూపొందించినట్లు చెప్పారు. ఏపి హిస్టరీ కాంగ్రెస్ వ్యవస్థాపకులు డాక్టర్ ఎం. పట్టాభిరామిరెడ్డి మల్లంపల్లి సోమశేఖర శర్మతో తనకు గ[ల] పరిచయాన్ని వివరించారు. 78[…] కాపలిలో జిల్లా చరిత్ర స[…] జరిపించిన చరిత్ర కా[…] ప్రశంసించారు. నెల్లూరు పుర[…] శాఖ రిజిస్టరింగ్ అధికారి డాక్టర్ జవహర్‌లాల్ జిల్లా పురాతన, మ[…] యుగ చరిత్ర వ్యాసాల[…] సమీక్షించారు. ప్రముఖ చరిత్ర కారుల[…] ఎస్.ఎస్. కృష్ణమూర్తి జిల్లా చరిత్ర గ్రంథాన్ని ఆవిష్కరించారు. సమగ్ర చరిత్రను ప్రచురించిన అధ్యయన కేంద్రాన్ని ప్రశంసించా రాయన. సర్వోదయ రసాయన శాస్త్ర శాఖాధిపతి, చరిత్ర అధ్యయన కేంద్రం సభ్యులు డాక్టర్ జి. రాజారెడ్డికి పదవీ విర[…] సందర్భంగా అయన్ను ప్రొఫెసర్ బాలకృష్ణా రెడ్డి సన్మానించారు. అధ్యయన కేంద్రం సభ్యులు […] కాంతారావు ప్రముఖులు […] సందేశాలను చదివారు. […] కేంద్రం ఎగ్జిక్యూటివ్ […] వెంకటేశ్వర రావు […] సమర్పణ చేసారు.

50 ఏళ్లక్రిత[…]

3 వ పేజీ కొరవ

### ధరలు

| | |
|---|---|
| పాతమొలగొలుకులు | 155-0-0 |
| ఆర్గగడ్డ | 139-0-0 |
| పాతకేసర్లు | 130-0-0 |



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,